Hajj Yaatra
(Telugu)

# హజ్ యాత్ర

రచన

ముహమ్మద్ ఖాజా మొయినుద్దీన్ అంజుమ్

అనువాదం

యాఖూబ్

# విషయ సూచిక

# హజ్ యాత్ర

## (మదీనా నుండి మక్కాకు ప్రవక్త (స) ప్రయాణం)

**ప్రశ్న: ఇస్లాం ధర్మానికి మూల స్తంభాలు ఎన్ని?**

**జవాబు:** ఐదు

**ప్ర: అవి ఏమిటి?**

**జ:** దేవుడు ఒక్కడేనని, ప్రవక్త ముహమ్మద్ (స) దైవప్రవక్త అని విశ్వాస ప్రకటన చేయడం. 2. నమాజ్‌ను స్థాపించడం. 3. రమజాన్ మాసంలో రోజాలు ఉండటం. 4. జకాత్ చెల్లించడం. 5. హజ్ యాత్ర చేయడం.

**ప్ర: ఇస్లాం ధర్మానికి ఐదో మూలస్తంభం ఏది?**

**జ:** హజ్ యాత్ర

**ప్ర: హజ్ అంటే ఏమిటి?**

**జ:** హజ్ యాత్ర కొరకు సంకల్పం చేసుకోవడం. షరీఅత్ నిర్వచనం ప్రకారం హజ్ కొరకు నిర్ణీత కాలంలో హజ్ సంకల్పం చేసుకొని కొన్ని ప్రత్యేక ఆచరణలను ఫర్జ్, వాజిబ్‌లతో నిర్వహించడాన్ని హజ్ అంటారు.

**ప్ర: హిజ్రీ శకం ఏ సంవత్సరంలో హజ్ యాత్రను విధిగా నిర్ణయించిన ఆదేశాలు అవతరించాయి?**

**జ:** హి.శ. తొమ్మిదో సంవత్సరంలో.

**ప్ర: దివ్యఖుర్‌ఆన్‌లోని ఏ సూరాలో హజ్ విధిగా నిర్ణయించబడిన ఆదేశాలున్నాయి?**

**జ:** సూరె ఆలి ఇమ్రాన్.

**ప్ర: హజ్ విధిగా నిర్ణయించబడింది అని సూరె ఆలి ఇమ్రాన్‌లోని ఏ ఆయత్‌లో ఉంది?**

**జ: వలిల్లాహి అలన్నాసి హిజ్జుల్ బైతి మనిస్ త తాఅ ఇలైహి సబీలా**

**అర్థం:** దేవుని ప్రసన్నత పొందడానికి స్తోమత ఉన్న ప్రజలు హజ్‌యాత్ర విధిగా చేయాలని ఆదేశించడం జరిగింది.

**ప్ర: సూరె ఆలి ఇమ్రాన్‌లోని ఎన్నో ఆయత్‌లో ఈ ఆదేశం ఉంది?**

**జ:** 97వ ఆయత్‌లో.

**ప్ర: సూరె ఆలిఇమ్రాన్‌లోని 97వ ఆయత్ భావం ఏమిటి?**

**జ:** దేవుని ప్రసన్నత పొందడానికి స్తోమత ఉన్న ప్రజలు దైవగృహం వద్దకు హజ్‌యాత్ర చేయాలని ఆదేశించడం జరిగింది. దీన్ని తిరస్కరిస్తే, దైవానికి యావత్ ప్రపంచంతో ఎలాంటి అవసరం లేదని తెలుసుకోవాలి.

**ప్ర: స్థోమత కలిగి ఉన్నప్పటికీ హజ్ చేయని వారి వైఖరిని ఖుర్ఆన్ ఏమని ప్రస్తావించింది?**

**జ:** తిరస్కార వైఖరి, హజ్ విధింపును తిరస్కరించేవారు.

**ప్ర: స్థోమత కలిగి ఉన్నప్పటికీ హజ్ చేయనివారి గురించి ప్రవక్త (స) ఏమని ప్రబోధించారు?**

**జ:** ప్రవక్త (స) ఇలా ప్రవచించారు: 'వారు ఆ స్థితిలో మరణించినా, క్రైస్తవులై, యూదులై మరణించినా ఒక్కటే.'

**ప్ర: హజ్ ఎవరిపై విధిగా చేయబడింది?**

**జ:** జ్ఞానమున్న, ప్రాజ్ఞదశకు చేరిన, స్వతంత్రుడైన, స్థోమత కలిగిన ప్రతి ముస్లింపై హజ్ విధిగా చేయబడింది.

**ప్ర: 'స్థోమత కలిగి ఉండటం' అంటే అర్థమేమిటి?**

**జ:** 'భార్యాపిల్లల పోషణకు కావలసిన వాటిని సమకూర్చడమే కాకుండా

కాబా గృహం వద్దకు చేరుటకు కావలసినంత ధనం కలిగి ఉన్నవారు' అని అర్థం.

**ప్ర: ప్రవక్త (స) హజ్ ఎప్పుడు చేశారు?**

జ: హి.శ. పదో సంవత్సరంలో.

**ప్ర: హి.శ. తొమ్మిదో సంవత్సరంలోనే హజ్ విధిగా నిర్ణయించబడినప్పటికీ ప్రవక్త (స) హజ్ చేయడంలో ఎందుకు ఆలస్యం చేశారు?**

జ: హ(జత్ ఇబ్రాహీం (అలైహి) నిర్ణయించిన పద్ధతి ప్రకారం జిల్‌హజ్ నెల తర్వాత సంవత్సరంలో అంటే హి.శ. పదో సంవత్సరంలో వచ్చింది. కాబట్టి ప్రవక్త అప్పటి వరకు వేచి ఉన్నారు.

**ప్ర: హి.శ. పదో సంవత్సరంలో చంద్రమాన ప్రకారం ఏ నెలలో ప్రవక్త (స) హజ్ చేయడానికి బయలు దేరారు?**

జ: జీఖాయిదహ్ నెలలో.

**ప్ర: జీఖాయిదహ్ నెలలో ఏ తేదీన హజ్ చేయడానికి బయలుదేరదామని ప్రవక్త (స) ప్రకటన చేయించారు?**

జ: జీఖాయిదహ్ పదో తేది.

**ప్ర: జీఖాయిదహ్ పదో తేదీన హజ్ చేయడానికి బయలుదేరదామని ప్రవక్త (స) ప్రకటన చేయించారు. కానీ ఆ రోజు వెళ్ళలేక పోయారు. మరి ఏ తేదీన ప్రవక్త (స) మదీనా నుండి పయనమయ్యారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం జీఖాయిదహ్ 25వ తేది.

**ప్ర: జీఖాయిదహ్ 25వ తేదీన ఏ రోజు వచ్చింది?**

జ: శనివారం.

**ప్ర: ప్రవక్త (స) ఆ రోజున ఏ నమాజు చేసి హజ్ కోసం బయలు దేరారు?**

జ: జుహ్ర్ నమాజు.

**ప్ర: ప్రవక్త (స) హజ్ కోసం బయలుదేరుతున్నప్పుడు మదీనా నగరంలో తన ప్రతినిధిగా ఎవరిని నియమించారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం అబూ దుజాన సాయిదీ (రజి)గారిని, మరో ఉల్లేఖనం ప్రకారం సిబా అరఫ్తా (రజి)గారిని.

**ప్ర: ప్రవక్త (స) హజ్‌కు బయలుదేరినప్పుడు ఆయనతోడు ఎందరు సతీ మణులు వెళ్ళారు?**

జ: ఆ సమయంలో సజీవంగా ఉన్న వారందరూ వెళ్ళారు.

**ప్ర: ప్రవక్త (స)తోపాటు హజ్ చేయడానికి ఎందరు సహాబాలు వెళ్ళారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం ఒక లక్షా ఇరవై నాలుగు వేల మంది. మరో ఉల్లేఖనం ప్రకారం ఒక లక్షా నలభై నాలుగు వేల మంది.

**ప్ర: ప్రవక్త (స) హజ్ ప్రయాణంలో ఎన్ని జంతువులను ఖుర్బానీ ఇవ్వడానికి తీసుకెళ్ళారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం ఒక వంద. రెండో ఉల్లేఖనం ప్రకారం 63 ఒంటెలు.

**ప్ర: ఆ జంతువుల పరిరక్షణకు ప్రవక్త (స) ఎవరిని నియమించారు?**

జ: హజ్రత్ నాజియ అస్లమా (రజి).

**ప్ర: ప్రవక్త (స) హజ్ ప్రయాణంలో మదీనా నుండి మక్కా వెళ్ళే మార్గంలో ఎక్కడ బస చేశారు?**

జ: జుల్ హులైఫా

**ప్ర: జుల్ హులైఫా ప్రాంతం మదీనా నగరం నుండి ఎంతదూరంలో ఉంది?**

జ: పది కిలో మీటర్లు.

**ప్ర: ప్రవక్త (స)గారి హజ్ బృందం జుల్ హులైఫా ప్రాంతంలో ఏఏ నమాజులు చేసింది?**

జ: అస్ర్, మగ్రిబ్, ఇషా నమాజులు. రెండో రోజు ఫజ్ర్, జుహ్ర్ నమాజులు.

**ప్ర: ప్రవక్త (స) జుల్ హులైఫాలో ఏ నమాజ్ తర్వాత ఇహ్రామ్ ధరించాలనుకున్నారు?**

జ: జుహ్ర్ నమాజ్ తర్వాత.

**ప్ర: ప్రవక్త (స) జుల్ హులైఫా ప్రాంతంలోనే ఇహ్రామ్ ధరించాలని నిర్ణయించుకున్నారు?**

జ: ప్రవక్త (స) మదీనా నుండి హజ్ లేదా ఉమ్రా చేయడానికి వచ్చే వారి కోసం 'జుల్ హులైఫా'ను మీఖాత్ ప్రాంతంగా నిర్ణయించారు.

**ప్ర: 'మీఖాత్' అంటే ఏమిటి?**

జ: హజ్, ఉమ్రా చేయడానికి వచ్చేవారి కోసం మక్కా సరిహద్దు ప్రాంతాల్లో ఇహ్రామ్ ధరించేందుకు నిర్ణయించబడిన ప్రత్యేక ప్రాంతాలను 'మీఖాత్' అంటారు.

**ప్ర: హజ్, ఉమ్రా చేయడానికి వచ్చేవారు మీఖాత్ ప్రాంతంలో ఇహ్రామ్ ధరించడం విధి. అయితే 'ఇహ్రామ్' అంటే ఏమిటి?**

జ: ఇహ్రామ్ అంటే హరామ్ చేయడం అని అర్థం. హజీలు హజ్, ఉమ్రా చేసే సంకల్పంతో ఇహ్రామ్ ధరించి తల్బియా పఠిస్తారు. అప్పటినుండి వారిపై కొన్ని ధర్మ సమ్మతమైన కార్యాలు హరామ్ అవుతాయి. అందుకనే దానిని 'ఇహ్రామ్' అంటారు. హాజీలు ధరించే తెల్లటి వస్త్రాలను కూడా 'ఇహ్రామ్' అనే అంటారు.

**ప్ర: పురుష హాజీలు ఇహ్రామ్ కోసం ఎన్ని వస్త్రాలను ఉపయోగిస్తారు?**

జ: రెండున్నర గజాల పొడవు, ఒకటింపావు గజం వెడల్పు గల రెండు వస్త్రాలు ఉపయోగిస్తారు. ఒకటి లుంగీలాగ నడుంకు చుట్టుకుని, రెండోది భుజాల మీద కప్పుకుంటారు.

**ప్ర: స్త్రీలు ఇహ్రామ్ కోసం ఎన్ని వస్త్రాలను ఉపయోగిస్తారు?**

జ: 1) తలకు చుట్టుకోవడానికి ఒక రుమాలు. 2) ఒక పొడవాటి వస్త్రం. 3) రోజువారి వస్త్రాలు కాషాయం లేనివి.

**ప్ర: మక్కా పరిసర ప్రాంతాల్లోని మీఖాత్ (హజ్, ఉమ్రాకోసం వచ్చేవారు ఇక్కడే ఇహ్రామ్ ధరిస్తారు) ప్రాంతాలేవి?**

జ: 1) జారాన (2) తన్‌యీమ్ 3) హుదైబియా 4) యలమ్‌లమ్ 5) జుల్ హులైఫా 6) హుజ్‌ఫ 7) ఖర్నుల్ మనాజిల్ 8) జాతె అరఖ్.

**ప్ర: ప్రవక్త (స) జుల్ హులైఫాలో ఇహ్రామ్ ధరించక ముందు ఏం చేశారు?**

జ: గుస్ల్ (స్నానం) చేశారు.

**ప్ర: ఇహ్రామ్ ధరించక ముందు ఎలాంటి శుభ్రతలు పాటించడం అభిలషణీయం?**

జ: మీసాలు కత్తిరించాలి, గోళ్లు కత్తిరించుకోవాలి. నాభి క్రింది వెంట్రుకలు తొలగించుకోవాలి. చంకల్లోని వెంట్రుకలు కత్తిరించుకోవాలి.

**ప్ర: ప్రవక్త (స) ఇలా ప్రవచించారు: ఐదు విషయాలు మానవ సహజ స్వభావమైనవి. 1) సున్తీ చేయించుకోవడం. 2) నాభి క్రింది వెంట్రుకలు తొలగించుకోవడం. 3) మీసాలు కత్తిరించడం 4) గోళ్లు కత్తిరించడం. 5) చంకల్లో వెంట్రుకలు తొలగించుకోవడం. ఈ హదీసుని సహీహైన్ హదీసు గ్రంథంలో ఉల్లేఖించిన సహాబి పేరు ఏమిటి?**

జ: హజ్రత్ అబూహురైరా (రజి).

**ప్ర: సహీహ్ ముస్లింలో హజ్రత్ అనస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం మీసాలు, గోళ్లు, చంకల్లోని వెంట్రుకలు, నాభి క్రింది వెంట్రుకలు ఎన్ని రోజుల కంటే ఎక్కువ ఉంచకూడదని ఆదేశించబడింది?**

జ: నలభై రోజులకంటే ఎక్కువ రోజులు.

**ప్ర: ప్రవక్త (స) ఇహ్రామ్‌ను ఎలా ధరించేవారు?**

జ: ఒక వస్త్రాన్ని లుంగీ మాదిరిగా ధరించి, మరో వస్త్రాన్ని కప్పుకోడానికి ఉపయోగించేవారు.

**ప్ర: హజ్, ఉమ్రా చేసేవారు 'మీఖాత్' ప్రాంతం నుండి ఇహ్రామ్ ధరించడం తప్పనిసరి. అయితే ప్రవక్త (స) జుల్ హులైఫాలో ఇహ్రామ్ ధరించి ఏం చేశారు?**

జ: రెండు రకాతుల నమాజ్ చేశారు.

**ప్ర: ప్రవక్త (స) నమాజ్‌లో ఏఏ సూరాలను పఠించారు?**

జ: మొదటి రకాత్‌లో సూరె ఫాతిహా తర్వాత సూరె కాఫిరూన్, రెండో రకాత్‌లో సూరె ఫాతిహా తర్వాత సూరె ఇఖ్లాస్ పఠించారు.

**ప్ర: ప్రవక్త (స) ఏ విధంగా నమాజ్ చేశారు?**

జ: తలపై గుడ్డ కప్పుకుని.

**ప్ర: 'హజ్ ఉమ్రా చేసే వారు తలకు గుడ్డ కట్టుకుని నమాజ్ చేయడం సాంప్రదాయం'. అయితే ప్రవక్త (స) ఇహ్రామ్ ధరించిన తర్వాత ఏం చేశారు?**

జ: తలపై ఉన్న గుడ్డను తీసి ముసల్లాపై కూర్చొని హజ్జె ఖిరాన్ కోసం సంకల్పించుకున్నారు.

**ప్ర: 'హజ్, ఉమ్రా చేసేవారు రెండు రకాతుల నమాజ్ తర్వాత తప్పనిసరిగా ఇహ్రామ్ ధరించాలి'. అయితే 'సంకల్పం' అంటే ఏమిటి?**

జ: మదిలో కోరుకోవడాన్ని 'సంకల్పం' అంటారు.

**ప్ర: హజ్ కోసం ఏ విధంగా సంకల్పం చేసుకోవడం సాంప్రదాయం?**

జ: లబ్బైక్ హజ్జన్ యా అల్లాహుమ్మ లబ్బైక్ హజ్జన్.

**ప్ర: హజ్జె ఖిరాన్ కోసం ఎలా సంకల్పం చేసుకోవాలి?**

జ: అల్లాహుమ్మ లబ్బైక్ హజ్జన్ వ ఉమ్రా.

ప్ర: **ఉమ్రా కోసం ఏ విధంగా సంకల్పం చేసుకోవాలి?**

జ: అల్లాహుమ్మ లబ్బైక్ ఉమరతన్, లేదా లబ్బైక ఉమ్రతన్.

ప్ర: **'హజ్ లేదా ఉమ్రా చేసేవారు నోటి ద్వారా సంకల్పం చేయడం ఉత్తమం' మరి మదిలో ఏ విధంగా సంకల్పం చేసుకుంటారో తెలుపండి?**

జ: ఓ అల్లాహ్ నేను హజ్ (లేదా) ఉమ్రా చేయాలని సంకల్పించుకున్నాను. ఈ కార్యాన్ని నాకోసం సరళం చెయ్యి. నా ద్వారా దీనిని స్వీకరించు. దీనిని నెరవేర్చడంలో సహాయం చెయ్యి. దీనిని నా కోసం శుభప్రదం చెయ్యి. అల్లాహ్ కోసం హజ్ (లేదా) ఉమ్రా చేయాలని సంకల్పించు కున్నాను. అందుకోసమే ఇహ్రామ్ ధరిస్తున్నాను.

ప్ర: **హజ్ (లేదా) ఉమ్రా చేసేవారు 'ముహ్రిమ్' అని ఎప్పుడు అనబడతారు?**

జ: ఇహ్రామ్ దుస్తులు ధరించి రెండు రకాత్‌ల నమాజ్ చేసిన తర్వాత తల్బియా పఠించాలి. అప్పుడు 'ముహ్రిమ్' అని అనబడతారు.

ప్ర: **ప్రవక్త (స) హజ్ ప్రయాణంలో మీఖాత్ ప్రాంతంలో ఇహ్రామ్ ధరించి బిగ్గరగా తల్బియా పలికారు. ప్రవక్త (స) తల్బియాలో ఏ వాక్యాలను పలికారు?**

జ: లబ్బైక్ అల్లాహుమ్మ లబ్బైక్ లబ్బైక్ లాషరీక లక లబ్బైక్ ఇన్నల్ హమ్ద వన్నిమత లక వల్ ముల్క లాషరీక లక్.

ప్ర: **ఇహ్రామ్ ధరించిన వ్యక్తి హజ్ (లేదా) ఉమ్రా చేస్తున్నట్టు సంకల్పించుకున్న వెంటనే తల్బియా పలకడం సాంప్రదాయం. అయితే ప్రవక్త(స) హజ్ కోసం బయలుదేరినప్పుడు జుల్ హులైఫా ప్రాంతంలో ఇహ్రామ్ ధరించి ఎన్నిసార్లు తల్బియా పలికారు?**

జ: మూడు (3) సార్లు.

**ప్ర: ముహ్రిమ్ తల్బియాలో ఏ విషయాన్ని ప్రకటిస్తాడు?**

జ: దైవ ఏకత్వాన్ని చాటుతూ బహుదైవారాధనను ఖండిస్తాడు.

'హాజరయ్యాను ఓ అల్లాహ్! నీ సమక్షంలో నేను హాజరయ్యాను. నీకు భాగస్వాములు ఎవరూ లేరు. నేను హాజరయ్యాను. నిశ్చయంగా సర్వ స్తోత్రములు, అనుగ్రహాలు మరియు రాజ్యాధికారం నీకే చెందుతుంది. నీకు భాగస్వాములెవ్వరూ లేరు.

**ప్ర: ఇస్లామీయ చరిత్ర ఆధారంగా తల్బియా పలకాలని ఏ సంఘటన ద్వారా తెలుస్తుంది?**

జ: జలాలైన్ అనే తఫ్సీర్ గ్రంథంలో ఇలా ఉంది: కాబా గృహ నిర్మాణానంతరం అల్లాహ్ ఆజ్ఞతో హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) అబూ ఖుబైస్ పర్వతం ఎక్కి ఇలా ప్రకటించారు: ప్రజలారా! అల్లాహ్ ఒక గృహాన్ని నిర్మించాడు. మీపై హజ్ 'విధి' చేశాడు. కాబట్టి మీరు అల్లాహ్ సమక్షంలో హాజరవ్వండి'. అందుకని ముహ్రిమ్ వ్యక్తి తల్బియా పఠించి హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) ప్రకటనకు సమాధానమిస్తున్నాడు.

**ప్ర: 'ముహ్రిమ్ వ్యక్తి తల్బియా పఠిస్తూ ఉండటం సంప్రదాయం'. అయితే ఏఏ ప్రాంతాలలో తల్బియా పఠించకూడదు?**

జ: ఉమ్రాలో తవాఫ్ కంటే ముందు ఇస్తిలామ్ చేస్తున్నప్పుడు, హజ్‌లో జమరతుల్ అక్బ (అనగా– పెద్ద షైతాన్)కు రాళ్లు రువ్వుతున్నప్పుడు.

**ప్ర: ప్రవక్త (స) హజ్‌లో ఎన్ని రకాలున్నాయని పేర్కొన్నారు?**

జ: మూడు రకాలు.

**ప్ర: హజ్‌లో మూడు రకాలేమిటి?**

జ: 1) హజ్జె ఇఫ్రాద్ 2) హజ్జె ఖిరాన్ 3) హజ్జె తమత్తు.

**ప్ర: 'హజ్జె ఇఫ్రాద్' అంటే ఏమిటి?**

జ: హజ్ దినాల్లో ఇహ్రామ్ ధరించి కేవలం హజ్ చేస్తున్నానని సంకల్పం చేసుకుని, హజ్ కార్యాలు ముగించుకున్న తర్వాత ఇహ్రామ్ తొలగించు కోవడం.

**ప్ర: హజ్జె ఖిరాన్ అంటే ఏమిటి?**

జ: 'ఖిరాన్' అంటే కలపడం అని అర్థం వస్తుంది. ఈ విధానంలో హజ్ దినాలలో ఇహ్రామ్ ధరించేటప్పుడు హజ్ మరియు ఉమ్రాల కోసం ఒకేసారి సంకల్పం చేసుకుంటారు. మొదట ఉమ్రా కార్యక్రమాలు పూర్తి చేసుకుంటారు. ఆ తర్వాత అదే ఇహ్రామ్‌తో హజ్ దినాల్లో హజ్ ముగిం చుకుని ఇహ్రామ్ విప్పుతారు.

**ప్ర: హజ్జె తమత్తు అంటే ఏమిటి?**

జ: 'తమత్తు' అంటే ఉపయోగం పొందడం. ఈ విధానంలో హజ్ దినాల్లో మొదట ఉమ్రా కోసం ఇహ్రామ్ ధరించి ఉమ్రా పూర్తి చేసుకుంటారు. ఉమ్రా పూర్తయిన తర్వాత ఇహ్రామ్ వస్త్రాలు తొలగించి ఇహ్రామ్ నిబంధనల నుండి విముక్తులవుతారు. హజ్ రోజులు వచ్చేవరకు ఉమ్రా కోసం ధరించిన ఇహ్రామ్ వల్ల హరామ్ అయిన వస్తువుల నుండి ఉపయోగం పొందుతారు. మళ్ళీ జిల్‌హజ్ ఎనిమిదో తేదీన హజ్ కొరకు సంకల్పం చేసుకుని ఇహ్రామ్ ధరించి, హజ్ కార్యక్రమాలు నెరవేర్చి ఇహ్రామ్ విప్పుతారు.

**ప్ర: ప్రవక్త (స) సహాబాలకు మూడు రకాల హజ్‌ల గురించి తెలిపి దేనిని ఎంచుకోమని ఉపదేశించారు?**

జ: మూడింటిలో ఏదో ఒక విధానాన్ని.

**ప్ర: ప్రవక్త (స) హజ్ ప్రయాణంలో ఉండగా మీఖాత్ ప్రాంతానికి చేరుకుని ఏ హజ్ చేయాలని సంకల్పం చేసుకున్నారు?**

జ: హజ్జె ఖిరాన్.

ప్ర: **హజ్ ప్రయాణంలో జుల్ హులైఫా (అంటే మీఖాత్ ప్రాంతం)లో అస్మా బిన్‌తె ఉమైస్ అబూబక్ర్ (రజి) భార్య దగ్గర ప్రసవించారు. అప్పుడు ప్రవక్త (స) ఆమెను ఏమని ఆదేశించారు?**

జ: గుస్ల్ (స్నానం) చేసి ఇహ్రామ్ ధరించమని.

ప్ర: **హజ్ ప్రయాణంలో జుల్ హులైఫా నుండి మక్కా వెళ్ళే మార్గంలో ప్రవక్త(స) ఎక్కడ బస చేశారు?**

జ: సర్ఫ్ ప్రాంతంలో.

ప్ర: **సర్ఫ్ ప్రాంతంలో మాతృమూర్తి ఆయిషా (రజి.అన్‌హా) ఎలాంటి అస్వస్థతకు గురయ్యారు?**

జ: బహిష్టుకు గురయ్యారు.

ప్ర: **హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) బహిష్టులో ఉండగా ప్రవక్త (స) ఏమని ఉపదేశించారు?**

జ: 'నీవు ఒక హాజీ చేయవలసిన పనులన్నీ చేయొచ్చు. అయితే పరిశుద్ధత కలిగేంతవరకు తవాఫ్ మాత్రం చేయొద్దు.'

ప్ర: **హజ్ ప్రయాణంలో ఏఏ మహిళలు బహిష్టుకు గురయితే ఆయన (స) పైవిధంగా ఉపదేశించారు?**

జ: సయ్యిదహ్ ఆయిషా (రజి. అన్‌హా), అబూబక్ర్ (రజి) గారి భార్య అస్మా బిన్తె ఉమైస్ (రజి.అన్‌హా).

ప్ర: **హజ్ ప్రయాణం చేస్తుండగా ఏ ప్రాంతంలో ప్రవక్త (స) 'ఎవరి వద్ద ఖుర్బానీ జంతువులు లేవో వారు ఉమ్రాచేసి ఇహ్రామ్ విప్పి, హలాల్ అవ్వండి' అని ఆదేశించారు?**

జ: సర్ఫ్ ప్రాంతం.

**ప్ర: “మీలో ఎవరి వద్ద ఖుర్బానీ జంతువులు లేవో వారు తమ ఇహ్రామ్‌ను ఉమ్రాగా మార్చి హలాల్ అవ్వండి’ అన్న ప్రవక్త (స) ఉపదేశం విన్న సురాఖ బిన్ మాలిక్ ‘ఈ సౌలభ్యం ఈ సంవత్సరం కొరకేనా? లేదా ఎల్లప్పటి కోసమా? అని ప్రశ్నించినప్పుడు ప్రవక్త (స) ఏమన్నారు?**

జ: ఆయన (స) తన ఒక చేతివ్రేళ్లను, రెండో చేతి వేళ్లలోకి దూర్చి ‘ఉమ్రా హజ్‌లో ప్రవేశించింది. ఎల్లప్పటికోసం’ అని అన్నారు.

**ప్ర: హజ్ ప్రయాణంలో ఆయన (స) మాతృమూర్తులకు ఏమని ఆదేశించారు?**

జ: అందరూ ఉమ్రాచేసి హలాల్ అవండి.

**ప్ర: ఈ ఆదేశం విని మాతృమూర్తులు ప్రవక్త (స)తో ఏమని ప్రశ్నించారు?**

జ: ‘మీరు కూడా మాతో పాటే ఇహ్రామ్ విడనాడొచ్చు కదా?.

**ప్ర: ప్రవక్త (స) సమాధానంగా ఏమని ఉపదేశించారు?**

జ: నా దగ్గర ఖుర్బానీ జంతువులున్నాయి. వాటి ఖుర్బానీ ఇచ్చేంతవరకు నేను ఇహ్రామ్ తొలగించను.

**ప్ర: హి.శ. పదో సంవత్సరంలో హజ్ చేయాలనుకునేవారి బృందం చంద్ర మానం ప్రకారం ఏ నెలలో ప్రవక్త (స)తో బాటు మక్కా నగరంలో ప్రవేశించింది?**

జ: జిల్‌హజ్ నాలుగో తేదీన.

**ప్ర: హి.శ. పదో యేట జిల్‌హజ్ మాసం నాలుగో తేదీన ప్రవక్త (స) మక్కా నగరంలోకి ప్రవేశించారు. అయితే అది ఏరోజు?**

జ: ఆదివారం.

**ప్ర: హి.శ. పదో యేట హజ్ చేసేవారి బృందం ప్రవక్త (స)తోపాటు మదీనా నుండి మక్కాకు ఎన్ని రోజుల్లో చేరింది?**

జ: తొమ్మిది రోజుల్లో.

**ప్ర: ప్రవక్త (స) కాబా గృహంలోకి ప్రవేశించే ముందు ఏం చేశారు?**

జ: గుస్ల్ (స్నానం) చేశారు.

**ప్ర: ప్రవక్త (స) ఏ ద్వారం ద్వారా మస్జిదె హరామ్‌లోకి ప్రవేశించారు?**

జ: సలామ్ ద్వారం.

**ప్ర: మస్జిద్‌లో ప్రవేశించడానికి సంప్రదాయబద్ధమైన విధానం తెలుపండి?**

జ: మస్జిద్‌లో ప్రవేశించేటప్పుడు మొదట కుడికాలు పెట్టాలి.

**ప్ర: మస్జిద్‌లో ప్రవేశించేటప్పుడు పఠించవలసిన దుఆ ఏది?**

జ: అల్లాహుమ్మగ్‌ఫిర్‌లీ జునూబి వఫ్ తహ్‌లీ అబ్వాబ రహ్‌మతిక్.

**ప్ర: ఈ దుఆ భావం ఏమిటి?**

జ: 'ఓ అల్లాహ్ నా పాపాలను మన్నించు. నాకోసం నీ కారుణ్య తలుపులను తెరిచి ఉంచు.'

**ప్ర: 'ముస్లిమ్ వ్యక్తి వుజూ స్థితిలో సలామ్ ద్వారం నుండి మస్జిదె హరాంలో ప్రవేశించడం అభిలషణీయం.' కాబాపై దృష్టిపడగానే ప్రవక్త (స) ఏమని ఉపదేశించారు?**

జ: 'ఓ అల్లాహ్! నీ గృహానికి ఇంకా గౌరవాన్ని, గొప్పతనాన్ని, ఔన్నత్యాన్ని ప్రసాదించు."

**ప్ర: కాబాపై దృష్టిపడిన వెంటనే ముస్లిమ్ ఏమని ప్రార్థించాలి?**

జ: జీవితంలో చేసే దుఆలలో యోగ్యమైన ప్రతి దుఆను స్వీకరించమని అల్లాహ్‌తో వేడుకోవాలి.

**ప్ర: ప్రవక్త (స) మస్జిదె హరామ్‌లో ప్రవేశించగానే ఏమని సంకల్పం చేసుకున్నారు?**

జ: కాబా తవాఫ్ చేయాలని.

ప్ర: కాబా గృహం ఎక్కడుంది?

జ: మక్కా నగరంలో.

ప్ర: అల్లాహ్ మొదటి ఆరాధనాలయం ఏది?

జ: కాబా గృహం.

ప్ర: కాబా గృహాన్ని మొదట ఎవరు నిర్మించారు?

జ: హజ్రత్ ఆదం (అలైహిస్సలాం)

ప్ర: ప్రజల మార్గదర్శకత్వం కోసం నిర్మించబడిన మొదటి ఆరాధనాలయ పునాదిని ఆదం (అ) ఎవరి ఆదేశంతో పెట్టారు?

జ: అల్లాహ్ ఆదేశంతో హజ్రత్ జిబ్రాయీల్(అలైహి) నిర్దేశనంతో.

ప్ర: ఈ ఆరాధనాలయ కట్టడం ఎలా ఉంది?

జ: దీర్ఘ చతురస్రాకారంలో.

ప్ర: దీర్ఘ చతురస్రాకారంలో ఉన్న కాబా గృహం నలుమూలల్ని ఏమంటారు?

జ: రుకున్

ప్ర: వాటి పేర్లు తెలుపండి?

జ: 1. రుకునె ఇరాఖీ 2. రుకునె షామి 3. రుకునె యమానీ 4. రుకునె అస్వద్

ప్ర: కాబా గృహం ఈశాన్యం మూలని ఏమంటారు?

జ: రుకునె ఇరాఖీ

ప్ర: వాయవ్య మూలని ఏమంటారు?

జ: రుకునే షామీ

ప్ర: నైరుతి మూలని ఏమంటారు?

జ: రుకునె యమానీ

**ప్ర: ఆగ్నేయ మూలని ఏమంటారు?**

జ: రుకునె సూద్

**ప్ర: కాబా ద్వారం ఏ దిశవైపు ఉంది?**

జ: తూర్పు వైపు అస్వద్ రాయి (హజ్రె అస్వద్)కు కుడివైపు.

**ప్ర: తౌబా ద్వారం ఏ దిశలో ఉంది?**

జ: కాబా గృహం ఈశాన్యమూలలో నిర్మించబడిన గది ద్వారమే 'తౌబా ద్వారం'

**ప్ర: హతీమ్ ఎక్కడుంది?**

జ: ఈశాన్యం, నైరుతి మూలల ముందు ఉన్న గోడలోపలి భాగమే 'హాతీమ్'

**ప్ర: కాబా గృహానికి నలువైపులా కొంతదూరం వరకు వేటాడటం, చెట్లు, గడ్డి కోయడం నిషేధం. ఆ ప్రాంతాన్ని ఏమంటారు?**

జ: దాని పవిత్రత కారణంగా 'హరమ్' అంటారు.

**ప్ర: హజ్ చేసేవారు ఇహ్రామ్ స్థితిలో భూమిపైనున్న జంతువులను వేటాడటం హరాంగా నిర్ణయించబడింది. ఈ విషయం సూరె మాయిదాలోని ఏ ఆయత్‌లో వివరించబడింది?**

జ: ఆయత్ నంబర్ 96. వ హుర్రిమ అలైకుమ్ సైదుల్ బర్రి మా దుమ్‌తుమ్ హురుమా.

**ప్ర: సూరె మాయిదాలోని ఏ ఆయత్‌లో 'హాజీలు ఇహ్రామ్ స్థితిలో కూడా నదుల్లో, సముద్రాలలో ఉన్న జంతువులను వేటాడటం, వాటి మాంసం తినడం హలాల్' అని పేర్కొనబడింది?**

జ: అయత్ నంబర్ 96. ఉహిల్లలకుమ్ సైదుల్ బహ్రి వత ఆముహూ.

**ప్ర: మక్కా నలువైపుల కొంతదూరం వరకు పవిత్రత వల్ల హరమ్ అని పిలువబడుతుంది. హరమ్ హద్దుల్లో ఉండే వారిని ఏమంటారు?**

జ: హర్మీ (లేదా) అహ్లె హరమ్ (హరమ్ వాసులు).

ప్ర: హరమ్ సరిహద్దుల నుండి మీఖాత్ వరకు ఉన్న ప్రదేశంలో హరమ్ సరిహద్దుల్లోని నిషేధిత వస్తువులు హలాల్ అవుతాయి. ఆ ప్రాంతాన్ని ఏమంటారు?

జ: హిల్.

ప్ర: హల్ ప్రాంత సరిహద్దుల్లో ఉండేవారిని ఏమంటారు?

జ: హిల్.

ప్ర: మక్కా నలువైపులా హరమ్ సరిహద్దు బయట హాజీలు, ఉమ్రాకు వచ్చే వారు ఇహ్రామ్ ధరించి రావడం తప్పనిసరి. ఆ ప్రాంతాన్ని ఏమంటారు?

జ: మీఖాత్.

ప్ర: మీఖాత్ సరిహద్దుల్లో ఉండేవారిని ఏమంటారు?

జ: మీఖాతీ.

# తవాఫ్ (ప్రదక్షిణ)

**ప్ర: హి.శ. 10వ యేట జిల్‌హజ్ 4వ తేదీన ప్రవక్త (స) కాబాలో ప్రవేశించగానే తవాఫ్ చేయాలని సంకల్పించుకున్నారు. అయితే దివ్యఖుర్‌ఆన్‌లో 'తవాఫ్' ప్రస్తావన ఎన్నిచోట్ల ఉంది?**

జ: రెండు సూరాలలో.

**ప్ర: దివ్యఖుర్‌ఆన్‌లోని ఏఏ సూరాలలో 'తవాఫ్' గురించి ప్రస్తావన ఉంది?**

జ: సూరె బఖరహ్, సూరె హజ్.

**ప్ర: సూరె బఖరహ్‌లోని ఏ ఆయత్‌లో 'తవాఫ్' ప్రస్తావన ఉంది?**

జ: 125వ ఆయత్. 'వ అహిద్‌నా ఇలా ఇబ్రాహీమ వ ఇస్మాయీల అన్ తహ్హిరా బైతియ లిత్తాయిఫీన వల్ ఆకిఫీన వర్రుక్క యిస్సుజూద్.'

''మేము ఇబ్రాహీం (అ), ఇస్మాయిల్ (అ)లతో ప్రమాణం తీసుకున్నాము. వారికి 'మా గృహానికి తవాఫ్,రుకూ, సజ్దాలు చేయడం కోసం వచ్చేవారి కొరకు పరిశుభ్రంగా ఉంచమని తాఖీదు చేశాము.'

**ప్ర: సూరె హజ్‌లోని ఏ ఆయత్‌లో తవాఫ్ గురించి ప్రస్తావించడం జరిగింది?**

జ: 26,29 ఆయత్‌లలో.

**ప్ర: సూరె హజ్‌లోని ఏ ఆయత్‌లో 'తవాఫ్ చేయడానికి వచ్చేవారి కోసం నా ఇంటిని పరిశుభ్రంగా ఉంచండి' అని చెప్పడం జరిగింది?**

జ: 26వ ఆయత్‌లో 'వ తహ్హిర్ బైతియ లిత్తాయిఫీన'.

**ప్ర: అల్లాహ్ 'కాబా గృహం తవాఫ్ చేయండి' అని హజ్ సూరాలోని ఏ ఆయత్‌లో పేర్కొన్నాడు?**

జ: ఆయత్ నంబర్ 29. 'వల్ యత్తవ్వఫూ బిల్ బైతిల్ అతీఖ్'.

**ప్ర: తవాఫ్ అంటే ఏమిటి?**

జ: తవాఫ్ పదానికి అర్థం ఏదైనా వస్తువు చుట్టూ ప్రదక్షిణలు చేయడం. షరీఅత్ ప్రకారం తవాఫ్ నిర్వచనం: కాబా గృహం చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణాలు చేయడాన్ని 'తవాఫ్' అంటారు.

**ప్ర: తవాఫ్‌లో ఎన్ని రకాలున్నాయి? వాటి పేర్లు తెలుపండి?**

జ: తవాఫ్‌లో ఆరు రకాలున్నాయి. అవి ఈ విధంగా ఉన్నాయి:

1) తవాఫె ఖుదూమ్ 2) తవాఫె జియారత్ 3) తవాఫె విదా 4) తవాఫె ఉమ్రా 5) తవాఫె నజ్ర్ 6) తవాఫె నఫిల్.

**ప్ర: తవాఫె ఖుదూమ్ అంటే ఏమిటి?**

జ: మక్కా నగరంలో ప్రవేశించగానే ముందుగా కాబా గృహానికెళ్ళి చేసే ఏడు ప్రదక్షిణలను తవాఫె ఖుదూమ్ అంటారు. ఎవరయినా కాబా గృహంలో ప్రవేశించి వేరే రకాల తవాఫ్‌లు చేసినా అంటే తవాఫె ఉమ్రా లేదా తవాఫె హజ్, తమత్తు, ఖిరాన్‌లు చేసినా తవాఫె ఖుదూమ్‌కు సరి సమానమవుతాయి.

**ప్ర: 'తవాఫె ఖుదూమ్‌ను 'తవాఫె తహియా' అని కూడా అంటారు. ఇది ఎలాంటి వారు చేయాలి?**

జ: తవాఫె ఖుదుమ్ లేదా తవాఫె ఖిరాన్ చేసే వారు.

**ప్ర: మీఖాత్ ప్రాంతం కంటే బయటి నుండి వచ్చే ఖారిన్‌లను ఏమంటారు?**

జ: అఫాఖీ

**ప్ర: హజ్జె తమత్తు చేయాలనే ఉద్దేశంతో మక్కా నగరానికి వచ్చే అఫాఖీలు కాబా గృహంలో ప్రవేశించగానే 'తవాఫె ఖుదూమ్' ప్రదక్షిణలు చేయాలా?**

జ: మీఖాత్ ప్రాంతం వెలుపలి నుండి వచ్చే వారి కోసం 'తవాఫె ఖుదూమ్' చేయడం సున్నతె ముఅక్కిదాగా పరిగణించబడింది. ఎలాంటి కారణం

లేకుండా వీటిని విడిచిపెట్టకూడదు. కాబా గృహంలో ప్రవేశించిన ప్రతి వ్యక్తి మొట్టమొదట తవాఫ్ చేయాలి.

**ప్ర: ఖారిన్ అంటే ఎవరు?**

జ: హజ్ మరియు ఉమ్రాలు ఒకేసారి చేయాలని సంకల్పించుకుని ఇహ్రామ్ ధరించే వ్యక్తిని 'ఖారిన్' అంటారు.

**ప్ర: ముఫ్రద్ అంటే ఎవరు?**

జ: కేవలం హజ్ చేసే సంకల్పంతో ఇహ్రామ్ ధరించే వ్యక్తిని 'ముఫ్రద్' అంటారు.

**ప్ర: ప్రవక్త (స) ఏ వైపు నుండి తవాఫ్ చేయడం ప్రారంభించారు?**

జ: కాబా గృహానికి నైరుతి వైపు హజ్రె అస్వద్ (నల్లరాయి) ఉన్న వైపు నుండి.

**ప్ర: 'తవాఫ్ చేయాలనుకునేవారు పరిశుభ్రంగా ఉండాలి. స్త్రీలయితే బహిష్టు, పురిటి రక్తస్రావం వంటి వాటి నుండి కూడా పరిశుభ్రంగా ఉండాలి. ఇంకా తప్పనిసరిగా వుజూ స్థితిలో ఉండాలి. అయితే ప్రవక్త (స) తవాఫ్ చేయడానికి ముందు ఏ కార్యాన్ని నిర్వహించారు?**

జ: ఇజ్తిబా కార్యం.

**ప్ర: ప్రవక్త (స) హజ్రె అస్వద్ వద్దకు ఏ స్థితిలో వెళ్ళారు?**

జ: ఇజ్తిబా స్థితిలో.

**ప్ర: 'తవాఫ్'లో ఇజ్తిబా పురుషులకోసం సున్నత్. స్త్రీల కొరకు కాదు'. అసలు ఇజ్తిబా అంటే ఏమిటి?**

జ: ఇహ్రాంలో పైన ధరించే వస్త్రం మధ్యభాగం కుడి చంక క్రింద నుండి పైకి తీసుకొచ్చి వస్త్రం రెండు కొనలు కుడిభుజం కనబడేటట్టు ఎడమ భుజంపై వేయాలి.

**ప్ర: 'ముహ్రిమ్ వ్యక్తి తవాఫ్ చేసే ముందు ఇజ్తిబా స్థితిలో వెళ్ళి హజ్రె అస్వద్‌ను దర్శించుకోవడం సున్నత్'. అసలు హజ్రె అస్వద్‌ను ఎలా దర్శించుకోవాలో తెలుపండి?**

జ: ముహ్రిమ్ కాబా గృహం ముందు తన కుడిభుజం హజ్రె అస్వద్‌కు ఎడమ వైపు ఉండేలా నిలబడి తవాఫ్ సంకల్పం చేసుకోవాలి.

**ప్ర: 'తవాఫ్ చేసేవారు తప్పనిసరిగా సంకల్పం చేసుకోవాలి.' తవాఫ్‌కోసం ఏ విధంగా సంకల్పం చేయాలి?**

జ: ఓ అల్లాహ్! నేను నీ పవిత్ర గృహం తవాఫ్ చేయాలని సంకల్పం చేసుకుంటున్నాను. ఈ కార్యాన్ని నాకోసం సులువు చెయ్యి. ఈ కార్యాన్ని స్వీకరించు.

**ప్ర: ప్రవక్త (స) ఇజ్తిబా స్థితిలో హజ్రె అస్వద్‌ను దర్శించుకుని తవాఫ్ ప్రారంభించే ముందు ఏం చేశారు?**

జ: హజ్రె అస్వద్‌కు ఇజ్తిలామ్ చేశారు.

**ప్ర: ఇజ్తిలామ్ చేయడం అంటే ఏమిటి?**

జ: షరీఅత్ నిర్వచనంలో హజ్రె అస్వద్‌ను తాకడాన్ని, చుమ్మించడాన్ని 'ఇజ్తిలామ్' అంటారు.

**ప్ర: ప్రవక్త (స) ఇజ్తిలామ్ ఎలా చేశారు?**

జ: ప్రవక్త (స) హజ్రె అస్వద్‌ను తాకారు. తన రెండు పెదాలను చాలాసేపు దానిపై అలానే ఉంచారు.

**ప్ర: ముహ్రిమ్ వ్యక్తి ఇజ్తిలామ్ ఏ విధంగా చేయాలి?**

జ: హజ్రె అస్వద్‌ను చూసి తవాఫ్ సంకల్పం చేసుకున్న తర్వాత దాని ముందుకు రావాలి. 'బిస్మిల్లాహి అల్లాహు అక్బర్' అంటూ రెండు చేతులను చెవుల వరకు లేపి వదిలి పెట్టాలి. అవసరమనిపిస్తే రెండు చేతు

లను హజ్రె అస్వద్‌పై పెట్టి రెండు చేతుల మధ్య తలపెట్టి మెల్లగా దాన్ని చుమ్మించాలి.

**ప్ర: ప్రవక్త (స) మొదటి తవాఫ్ ఏ విధంగా చేశారు?**

జ: నడుచుకుంటూ.

**ప్ర: 'తవాఫ్ నడుచుకుంటూ చేయడం తప్పనిసరి'. ప్రవక్త (స) తవాఫ్ చేయడం ఎలా ప్రారంభించారు?**

జ: హజ్రె అస్వద్‌ను దర్శించుకుంటూ తన కుడివైపు తిరుగుతూ తవాఫ్ చేయడం ప్రారంభించారు. అప్పుడు కాబా ద్వారం మరియు హతీమ్‌లు ప్రవక్త (స)కు ఎడమవైపు ఉన్నాయి.

**ప్ర: ముహ్రిమ్ తవాఫ్ చేస్తున్నప్పుడు ఏఏ విషయాలను గుర్తుంచుకోవాలి?**

జ: 1) తవాఫ్ మధ్యలో కాబాను చూసిచూడనట్లుండటం మక్రూహ్. 2) కాబా మరియు హతీమ్ ముహ్రిమ్‌కు ఎడమ వైపు ఉండాలి. హతీమ్‌కు బయట ఉండి తవాఫ్ చేయాలి.

**ప్ర: కాబా గృహంలో హతీమ్ ఎక్కడుంది?**

జ: కాబా గృహానికి ఉత్తరాన గొట్టం (పైకప్పుపై చేరే నీరు క్రిందపడేందుకు అమర్చిన గొట్టం) ఉన్న గోడకు ముందు ఉన్న మరో గోడ లోపలి భాగంలో హతీమ్ ఉంది.

**ప్ర: ప్రవక్త (స) తవాఫ్ చేస్తూ ఏం చేశారు?**

జ: తవాఫ్‌లోని మొదటి మూడు ప్రదక్షిణలు (రమ్ల్ చేస్తూ) త్వరత్వరగా ముగించుకుని మిగతా నాలుగు ప్రదక్షిణలు మామూలు వేగంతో చేశారు. అన్ని ప్రదక్షిణలు ఇజ్తిబా స్థితిలోనే చేశారు.

**ప్ర: 'రమ్ల్' అంటే ఏమిటి?**

జ: భుజాలు కదుపుతూ దగ్గరదగ్గరగా అడుగులేస్తూ వేగంగా నడిచే ప్రక్రియను 'రమ్ల్' అంటారు.

**ప్ర: 'రమ్ల్, ఇజ్తిబాలు తవాఫె ఖుదూమ్‌లోనే చేయాలి. ఇతర తవాఫ్‌లలో చేయకూడదు.' తవాఫ్‌లోని మూడు ప్రదక్షిణాలలో రమ్ల్ చేయడం ప్రవక్త (స)గారి ఏ సంఘటనకు సంబంధం కలిగి ఉంది?**

జ: వివిధ ఉల్లేఖనాల ప్రకారం తెలుస్తున్న విషయం ఏమంటే; హి.శ. ఏడో సంవత్సరం ప్రవక్త (స) సహాబాల ఒక బృందంతో కలిసి ఉమ్రా చేయడం కోసం మక్కా చేరారు. మదీనా వాతావరణం వారిని బలహీన పరిచిందని మక్కా కురైషీలు గుసగుసలాడుకోసాగారు. ఈ విషయం ప్రవక్త (స)గారికి తెలిసింది. అప్పుడు ప్రవక్త (స) సహాబాలకు మొదటి మూడు ప్రదక్షిణా లలో తమ శక్తి సామర్థ్యాలను నిరూపించుకోవలసిందిగా ఆదేశించారు. సహాబాల ఈ కార్యం అల్లాహ్‌కు ఎంతగానో నచ్చింది. అప్పటి నుంచి శాస్వతంగా ఈ కార్యాన్ని సున్నత్‌గా నిర్ణయించడం జరిగింది. అదే ఇప్పటి వరకు అమలులో ఉంది.

**ప్ర: ప్రవక్త (స) తవాఫ్ ప్రారంభించి రుక్నె యమానీ వద్ద ఏం చేశారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (స) రుక్నె యమానీని తాకారు. చుమ్మించ లేదు. చేతులతో తాకారు. ఆ చేతులను మళ్ళీ పెదాలతో చుమ్మించలేదు.

**ప్ర: 'తవాఫ్ మధ్యలో రుక్నె యమానీని తాకడం ముస్తహబ్'. ప్రవక్త (స) తవాఫ్ చేస్తూ హజ్రె అస్వద్, రుక్నె యమానీ మధ్య ఏ ఆయత్ పఠించారు?**

జ: రబ్బనా ఆతినా ఫిద్దున్‌యా హసనతన్ వఫిల్ ఆఖిరతి హసనతన్ వఖినా అజాబన్నార్.

**ప్ర: ఈ సూక్తి ఏ సూరాలో ఉంది?**

జ: బఖరహ్ సూరాలోని 201వ సూక్తి.

ప్ర: ఈ ఆయత్ భావం ఏమిటి?

జ: ఓ అల్లాహ్! మాకు ఈ ప్రపంచంలో సాఫల్యాన్ని ప్రసాదించు. పర లోకంలో కూడా సాఫల్యాన్ని ప్రసాదించు. మమ్మల్ని నరకాగ్ని నుండి రక్షించు.

ప్ర: ప్రవక్త (స) తవాఫ్ చేస్తూ మొదటి ప్రదక్షిణను ఎక్కడ పూర్తి చేశారు?

జ: హజ్రె అస్వద్.

ప్ర: 'తవాఫ్‌లోని ప్రతి ప్రదక్షిణ హజ్రె అస్వద్‌తో మొదలై అక్కడే పూర్తవు తుంది.' ప్రవక్త (స) మొదటి ప్రదక్షిణ పూర్తి చేసుకుని రెండవ ప్రదక్షిణ చేయడానికి ముందు ఏం చేశారు?

జ: హజ్రె అస్వద్‌ను చుమ్మించారు.

ప్ర: 'ముహ్రిమ్ తవాఫ్‌లోని ప్రతి ప్రదక్షిణకు ముందు హజ్రె అస్వద్‌ను చుమ్మిం చడం సున్నత్'. ముహ్రిమ్ వ్యక్తికి చుమ్మించడం సాధ్యపడకపోతే ప్రత్యా మ్నాయంగా ఏం చేయాలి?

జ: 1) ముహ్రిమ్ వ్యక్తి చేయి హజ్రె అస్వద్ వరకు చేరితే దాన్ని చేత్తో తాకి చేతిని చుమ్మించాలి. లేదా 2) కర్ర సహాయంతో హజ్రె అస్వద్‌ను తాకి కర్రను చుమ్మించాలి. 3) రెండు చేతులను హజ్రె అస్వద్‌కు చూపిస్తూ రెండు చేతులను ముద్దాడాలి.

ప్ర: ప్రవక్త (స) తవాఫ్‌లో మొత్తం ఎన్ని ప్రదక్షిణలు చేశారు?

జ: ఏడు

ప్ర: 'కాబా గృహం చుట్టూ ఏడు ప్రదక్షిణలు ఒకదాని తర్వాత ఒకటి చేయడం సాంప్రదాయం'. వీటిలో ఎన్ని ప్రదక్షిణలు ఫర్జ్, మరెన్ని ప్రదక్షిణలు వాజిబ్?

జ: నాలుగు ప్రదక్షిణలు ఫర్జ్, మూడు వాజిబ్.

**ప్ర: తవాఫ్‌లోని ప్రతి ప్రదక్షిణను ఏమంటారు?**

జ: షూత్.

**ప్ర: 'హజ్ కార్యంలో ఒక అంశం తవాఫ్'. ఏడు ప్రదక్షిణలు పూర్తి చేసుకుని ప్రవక్త (స) ఏం చేశారు?**

జ: హజ్రె అస్వద్‌ను ఎనిమిదో సారి చుమ్మించారు.

**ప్ర: ప్రవక్త (స) హజ్రె అస్వద్‌ను ఎనిమిదోసారి ముద్దాడి ఎక్కడికి వెళ్ళారు?**

జ: మఖామె ఇబ్రాహీం వద్దకు.

**ప్ర: ప్రవక్త(స) మఖామె ఇబ్రాహీమ్ వైపుకు వెళుతూ ఏ ఆయత్ పఠించారు?**

జ: సూరె బఖరహ్‌లోని 125వ ఆయత్. 'వత్తఖిజూ మిమ్ మఖామి ఇబ్రాహీమ ముసల్లా' పఠించారు.

**ప్ర: ప్రవక్త (స) మఖామె ఇబ్రాహీం వద్ద ఏమని సంకల్పం చేసుకున్నారు?**

జ: రెండు రకాతుల నమాజ్ చేయాలని.

**ప్ర: 'ముహ్రిమ్ హజ్రె అస్వద్‌ను ఎనిమిదోసారి చుమ్మించిన తర్వాత మఖామె ఇబ్రాహీం వద్ద రెండు రకాత్‌ల నమాజ్ చేయడం తప్పనిసరి.' ప్రవక్త (స) నమాజ్ ఎక్కడ చేశారు?**

జ: మఖామె ఇబ్రాహీం దగ్గర. (కాబా గృహానికి మఖామె ఇబ్రాహీంకు మధ్య)

**ప్ర: ప్రవక్త (స) ఏ స్థితిలో నమాజ్ చేశారు?**

జ: ఇజ్తిబా స్థితిలో

**ప్ర: ప్రవక్త (స) నమాజ్‌లో ఏఏ సూరాలను పఠించారు?**

జ: మొదటి రకాత్‌లో ఫాతిహా సూరా తర్వాత సూరె ఫిరౌన్, రెండో రకాత్‌లో సూరె ఇఖ్లాస్.

**ప్ర: మఖామె ఇబ్రాహీం దగ్గర నమాజ్ చేయడానికి చోటు దొరక్కపోతే ఎక్కడ నమాజ్ చేయాలి?**

జ: హరమ్ సరిహద్దుల్లో ఎక్కడైనా చేయొచ్చు.

**ప్ర: కాబా గృహంలో మఖామె ఇబ్రాహీం ఎక్కడ ఉంది?**

జ: కాబా గృహానికి తూర్పు వైపున మతాఫ్‌లో.

**ప్ర: మతాఫ్ అంటే ఏమిటి?**

జ: బైతుల్లాహ్ (అల్లాహ్ గృహం)కు నలువైపుల తవాఫ్ చేసే ప్రదేశం.

**ప్ర: దివ్యఖుర్‌ఆన్‌లో మఖామె ఇబ్రాహీం ప్రస్తావన ఎన్నిచోట్ల వచ్చింది?**

జ: రెండు సూరాలలో.

**ప్ర: ఆ సూరాల పేర్లేమిటి?**

జ: సూరె బఖరహ్, సూరె ఆలి ఇమ్రాన్.

**ప్ర: సూరె బఖరహ్‌లోని ఏ ఆయత్‌లో మఖామె ఇబ్రాహీం ప్రస్తావన ఉంది?**

జ: 125వ ఆయత్‌లో 'వత్తఖిజూ మిమ్ మఖామి ఇబ్రాహీమ ముసల్లా.'

**ప్ర: సూరె ఆలి ఇమ్రాన్‌లోని ఏ ఆయత్‌లో మఖామె ఇబ్రాహీం ప్రస్తావన ఉంది?**

జ: 97వ ఆయత్‌లో ఫీహి ఆయాతుమ్ బయ్యినాతుమ్ మఖాము ఇబ్రాహీమ్.

**ప్ర: ఇస్లాం చరిత్రలో మఖామె ఇబ్రాహీంకు ప్రాముఖ్యత ఎందుకు ఉంది?**

జ: మఖామె ఇబ్రాహీం అన్నది స్వర్గం నుండి తీసుకొచ్చిన ఒక రాయి. ఇబ్రాహీం (అలైహి) దానిపై నిలుచొని కాబా గృహ గోడను పెద్దగా నిర్మించారు. అందువల్ల ఆ రాయిపై ఇబ్రాహీం (అలైహి) కాలు గుర్తులు దానిపై పడ్డాయి. ఈ పవిత్ర ప్రాంతంలోనే తవాఫ్‌లోని ఏడు ప్రదక్షిణలు పూర్తిచేసుకున్న తర్వాత తహియ్యతుత్తవాఫ్ పేరుతో చేయబడే రెండు రకాతుల నమాజ్‌కి ఎంతో ప్రాముఖ్యత ఉంది.

ప్ర: **ప్రవక్త (స) తవాఫ్ చేసి, రెండు రకాతుల నమాజ్ చేసి ఎక్కడకు వెళ్ళారు?**

జ: ముల్తజిమ్ ప్రాంతానికి

ప్ర: **కాబాలో ముల్తజిమ్ ప్రాంతం ఎక్కడుంది?**

జ: హజ్రె అస్వద్, కాబా కూడలి మధ్యలో.

ప్ర: **ప్రవక్త (స) ముల్తజిమ్ దగ్గర ఏం చేశారు?**

జ: ప్రవక్త (స) ముల్తజిమ్‌ను హత్తుకుని తన రెండు చేతులు చాచి ప్రార్థనలు చేశారు.

ప్ర: **ఆ తర్వాత ప్రవక్త (స) ముల్తజిమ్ ప్రాంతం నుండి ఎక్కడికి వెళ్ళారు?**

జ: జమ్ జమ్ బావి వద్దకు.

ప్ర: **ప్రవక్త (స) జమ్‌జమ్ నీటిని సేవిస్తూ ఏమని ఉపదేశించారు?**

జ: "జమ్ జమ్ నీటిలో శుభాలే కాకుండా ఆహారం, ఔషధం కూడా ఉంది."

ప్ర: **జమ్‌జమ్ నీటిని ఆగుతూ మూడు శ్వాసల్లో త్రాగాలి. అప్పుడు పఠించాల్సిన అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఉల్లేఖించిన దుఆ ఏది?**

జ: 'అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుక ఇల్‌మన్ నాఫిఅన్, వ రిజ్‌ఖన్ వాసిఅన్, వ షిఫాఅన్ మిన్‌కుల్లి దాయిన్.

ప్ర: **ఈ దుఆ భావం ఏమిటి?**

జ: ఓ అల్లాహ్! నాకు లాభదాయకమైన విద్యను ప్రసాదించు. విస్తృత ఉపాధిని ఇవ్వు, ప్రతి వ్యాధి నుండి విముక్తిని కలిగించు.

ప్ర: **'ముహ్రిమ్ సయీ కంటే ముందు తవాఫ్ చేయడం తప్పనిసరి' ప్రవక్త (స) జమ్‌జమ్ నీటిని సేవించి ఏమని సంకల్పం చేసుకున్నారు?**

జ: హజ్రె అస్వద్‌ను తొమ్మిదోసారి చుంబించాలని.

# సయీ (పరుగెత్తే ప్రక్రియ)

ప్ర: 'ముహ్రిం వ్యక్తి తవాఫ్ పూర్తి చేసుకున్న తర్వాత సయీ కంటే ముందు హజ్రె అస్వద్‌ను తొమ్మిదోసారి చుంబించడం సున్నత్' అయితే ప్రవక్త (స) హజ్రె అస్వద్‌ను తొమ్మిదోసారి చుంబించిన తర్వాత ఏమని సంకల్పం చేసుకున్నారు?

జ: సఫా మర్వాల మధ్య సయీ చేయాలని.

ప్ర : 'హజ్, ఉమ్రా చేసేవారు సయీ తప్పనిసరిగా చేయాలి. తవాఫ్ తర్వాత సయీ చేయడం సున్నత్' ప్రవక్త(స) సయీ కోసం కాబా నుండి ఏ మార్గం ద్వారా వెళ్ళారు?

జ: సఫా ద్వారం ద్వారా.

ప్ర: సఫా, మర్వాల మధ్య సయీ చేయడం అంటే ఏమిటి?

జ: సఫా, మర్వాలు మస్జిదె హరామ్ ముందు ఉన్న చిన్న పర్వత శ్రేణులు. వాటి మధ్య ఏడుసార్లు పరుగెత్తే ప్రత్యేక ప్రక్రియను 'సయీ'అంటారు.

ప్ర: 'సయీ కోసం బహిష్టు, పురుటి రక్తస్రావం వంటివాటి నుండి పరిశుభ్రంగా ఉండటం అభిలషణీయం' అయితే ముహ్రిమ్ వ్యక్తి సయీ చేస్తున్నానని ఎక్కడ సంకల్పం చేసుకోవడం ఉత్తమం?

జ: సఫా పర్వతం వద్ద.

ప్ర: ప్రవక్త(స) ఏవిధంగా సయీ చేశారు?

జ: నడుచుకుంటూ.

ప్ర: ప్రవక్త(స) సయీ చేయడానికి మొదట ఎటువైపు వెళ్ళారు?

జ: సఫా పర్వతానికి దగ్గరగా.

ప్ర: ప్రవక్త(స) అక్కడకు వెళ్ళి ఏ ఆయత్‌ను పఠించారు?

జ: 'ఇన్నస్సఫా వల్ మర్వత మిన్ షఆయిరిల్లాహ్'

ప్ర: ప్రవక్త(స) సఫా పర్వతంపై ఎంత పై వరకు ఎక్కారు?

జ: కాబా గృహం కనబడేంత పైవరకు

ప్ర: 'ముహ్రిమ్ సఫా మర్వా పర్వతాలపై ఎక్కడం సున్నత్' ప్రవక్త(స) సఫా పర్వతంపైకెక్కి ఖిబ్లా వైపు తిరిగి దైవస్తోత్రం చేస్తూ ప్రార్థనలు ఎన్నిసార్లు పునరావృతం చేశారు?

జ: మూడు మూడు సార్లు

ప్ర: 'ముహ్రిమ్ సఫా మర్వా పర్వతాలపై ఖిబ్లా వైపు నిలబడి మూడు, మూడు సార్లు దుఆ చేయడం అభిలషణీయం' ప్రవక్త(స) సఫా పర్వతం దిగి ఎటువైపు వెళ్ళారు?

జ: మర్వా పర్వతం వైపు

ప్ర: ప్రవక్త(స) సఫా మర్వా పర్వతాల మధ్య కొన్నిచోట్ల వేగంగానూ, మరికొన్ని చోట్ల సాధారణ వేగంతో నడిచారు. ఈ ప్రక్రియ చరిత్రలో ఏ మహిళ అనుకరణను సూచిస్తుంది?

జ: హాజిరహ్ (అలైహి)

ప్ర: 'ముహ్రిమ్' సయీ చేస్తున్నప్పుడు ఎత్తు ఎక్కేటప్పుడు పరిగెత్తడం, దిగేటప్పుడు మెల్లగా దిగడం సంప్రదాయం. ఈ విషయంలో మహిళల కోసం ఆదేశాలేమిటి?

జ: మహిళలు సఫా,మర్వా పర్వతాల మధ్య సాధారణ నడకతోనే నడవాలి.

ప్ర: 'ప్రవక్త(స) సయీను సఫా పర్వతం నుంచి ప్రారంభించారు' ఎక్కడ పూర్తిచేశారు?

జ: మర్వా పర్వతం వద్ద

ప్ర: ప్రవక్త(స) మర్వా పర్వతం నుండి రెండోసారి నడవడం ప్రారంభించి ఎక్కడ పూర్తిచేశారు?

జ: సఫా పర్వతంపై

ప్ర: ప్రవక్త(స) సఫా మర్వా పర్వతాల మధ్య మొత్తం ఎన్నిసార్లు తిరిగారు?

జ: ఏడుసార్లు

ప్ర: సఫా నుండి మర్వా వరకు, మర్వా నుండి సఫా పర్వతం వరకు ఏడుసార్లు తిరగడాన్ని ఏమంటారు?

జ: సయీ అంటారు.

ప్ర: సయీ చేసేటప్పుడు తిరిగే ఒక్కొక్క చుట్టును ఏమంటారు?

జ: షూత్

ప్ర: ప్రవక్త(స) సయీలోని ఏడవ చుట్టును ఎక్కడ ముగించారు?

జ: మర్వా పర్వతంపై

ప్ర: సయీలోని ఏడు చుట్లలో ఎన్ని చుట్లు ఫర్జ్‌లు, ఎన్ని చుట్లు వాజిబ్‌లు?

జ: సయీలోని మొదటి నాలుగు చుట్టులు ఫర్జ్‌లు, మిగతా మూడు చుట్టులు వాజిబ్‌లు.

ప్ర: 'అజ్ఞానకాలంలో హజ్ మాసంలో ఉమ్రా చేయడం చాలా పెద్దపాపంగా పరిగణించడం జరిగేది'. ప్రవక్త(స) తవాఫ్, సయీలను ముగించుకుని పైన పేర్కొన్న తప్పుడు దృక్పథాన్ని సరిదిద్దడానికి ప్రవక్త(స) ఏమని ఉద్బోధించారు?

జ: 'మీలో ఎవరి వద్ద ఖుర్బానీ జంతువులు లేవో వారు తమ తవాఫ్, సయీలను ఉమ్రాలుగా నిర్ణయించుకుని ఇహ్రామ్‌ను తొలగించుకోండి.'

ప్ర: ప్రవక్త(స) ఖుర్బానీ జంతువులు ఉన్న వారినుద్దేశించి ఏమని హితవు పలికారు?

జ: 'అందరూ ఉమ్రాతోపాటు హజ్ కూడా చేస్తున్నట్టు సంకల్పం చేసుకోండి. హజ్ పూర్తయిన తర్వాత ఇహ్రామ్‌ను తొలగించుకోండి'.

**ప్ర: ఖుర్బానీ జంతువులు తీసుకురాని సహాబాలు తవాఫ్, సయీలు ముగించు కున్నాక ఎలా హలాల్ అయ్యారు?**

జ: కొందరు సహాబాలు గుండు గొరిగించుకున్నారు, మరికొందరు వెంట్రు కలు చిన్నవిగా చేయించుకుని హలాల్ అయ్యారు.

**ప్ర: హి.శ. పదో యేడు జిల్‌హజ్జ్ నాలుగో తేదీన ఉమ్రా ప్రక్రియను ముగించుకున్న హాజీల బృందం, హజ్ దినాలు వచ్చేవరకు ప్రవక్త(స)తో పాటు ఎక్కడ నివాసం ఉన్నారు?**

జ: అబ్‌తహ్ ప్రాంతంలో

**ప్ర: ఉమ్రా పూర్తిచేసుకున్న ముఫ్రద్, ఖారిన్, ముతమత్తులు హజ్ రోజులు వచ్చేంతవరకు మక్కాలో ఉండి ఏం చేయాలి?**

జ: అయినంతవరకు నఫిల్ తవాఫ్‌లు చేస్తుండాలి.

**ప్ర: నఫిల్ తవాఫ్‌లు రమ్ల్, ఇస్తిబా స్థితిలో చేయాలా?**

జ: రమ్ల్, ఇజ్తిబా లేకుండానే నఫిల్ తవాఫ్‌లు చేయాలి. ఇహ్రామ్ కూడా ధరించనవసరం లేదు.

**ప్ర: నఫిల్ తవాఫ్‌ల తర్వాత సయీ చేయాలా? వద్దా?**

జ: నఫిల్ తవాఫ్‌ల తర్వాత సయీ చేయకూడదు.

ప్ర: నఫిల్ తవాఫ్ చేసిన తర్వాత రెండు రకాతుల నఫిల్ నమాజ్ గురించి ఏమని ఆదేశించబడింది?

జ: నమాజ్ చేయడం తప్పనిసరి.

# హజ్

**ప్ర: చంద్రమానం ప్రకారం ఏఏ నెలలను హజ్ నెలలు అని పిలువడం జరుగుతుంది?**

జ: షవ్వాల్, జీ ఖాయిదహ్, జిల్ హజ్

**ప్ర: దివ్యఖుర్ఆన్‌లో ఏ సూరాలో హజ్ నెలలకు సంబంధించిన ప్రస్తావన ఉంది?**

జ: సూరె బఖరహ్

**ప్ర: సూరె బఖరహ్‌లోని ఏ ఆయత్‌లో హజ్ నెలల ప్రస్తావన ఉంది?**

జ: 197వ ఆయత్‌లో

**ప్ర: చంద్రమాన నెల షవ్వాల్ కంటే ముందు హజ్ కోసం ఇహ్రామ్ ధరించడం సమంజసమేనా?**

జ: కాదు

**ప్ర: జిల్‌హజ్ మాసంలోని ఏ దినాలను హజ్ దినాలు అంటారు?**

జ: జిల్‌హజ్ నెల ఎనిమిదవ తేదీ నుండి పదమూడవ తేదీ వరకు దినాలను హజ్ దినాలు అంటారు. ఈ దినాలలో హజ్ కార్యక్రమాలు (ఫర్జ్, వాజిబ్‌లు) పూర్తి చేయాల్సి ఉంటుంది.

**ప్ర: ఏ రోజు నుండి హజ్ కార్యకలాపాలు ప్రారంభించాల్సి ఉంటుంది?**

జ: అత్ తరావియ్య రోజు నుండి.

**ప్ర: జిల్‌హజ్ నెలలో ఏ తేదీని 'యౌమె తరావియ్య' అంటారు.**

జ: జిల్‌హజ్ ఎనిమిదో తేదీని

**ప్ర: హజ్జె తమత్తు చేయాలనుకున్న భారతదేశ హాజీలు ఎప్పుడు సయీ చేయడం ఉత్తమం?**

జ: తవాఫ్ చేసుకున్న తర్వాత.

ప్ర: జిల్‌హజ్ ఎనిమిదో తేదీన ముతమత్తు సయీ ముందుగానే చేసు కోవాలి. అయితే అతను సయీ ఏవిధంగా చేయాలి?

జ: రమ్ల్, ఇజ్తిబాలతో నఫిల్ తవాఫ్ చేసి సయీ చేయాలి.

ప్ర: 'హజ్ యాత్ర సందర్భంగా ప్రవక్త(స) హజ్, ఉమ్రాల ఇహ్రామ్ ధరించి ఉన్నారు' అయితే కొందరు సహాబాలు ఉమ్రా చేసి హలాల్ అయ్యారు. మళ్ళీ వారు ఏ రోజు హజ్ కోసం ఇహ్రామ్ ధరించారు?

జ: జిల్‌హజ్ ఎనిమిదో తేదీన.

ప్ర: మక్కావాసులు హజ్ కోసం ఇహ్రామ్ ఎక్కడ ధరించాలి?

జ: హరమ్ సరిహద్దుల్లో

ప్ర: హి.శ. పదో యేడు జిల్‌హజ్ ఎనిమిదో తేదీన హాజీల బృందం ప్రవక్త(స)తో పాటు మక్కా నుండి ఎక్కడకు బయలుదేరారు?

జ: మినాకు

ప్ర: ప్రవక్త(స) ఏ నమాజ్ చేసి మక్కా నుండి మినా కోసం బయలుదేరారు?

జ: ఫజర్ నమాజ్ తర్వాత

ప్ర: మక్కా నగరానికి మినా ఏ దిక్కున ఉంది?

జ: తూర్పువైపు

ప్ర: మక్కా నగరం నుండి మినా ఎన్ని కి.మీ దూరంలో ఉంది?

జ: 5 కి.మీ

ప్ర: ఇస్లాం చరిత్రలో మీనాకు గల ప్రత్యేకత ఏమిటి?

జ: ఇబ్రాహీం(అలై) అల్లాహ్ ఆజ్ఞతో తన ప్రియ కుమారుడు ఇస్మాయీల్(అ)ను జిబహ్ చేసే ఉద్దేశంతో మినా ప్రాంతానికి తీసుకెళ్ళారు.

ప్ర: మినా ప్రాంతం హరమ్ పరిధిల్లో ఉందా? లేక హిల్ పరిధిలో ఉందా?

జ: హరమ్ పరిధిలో

ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ ఎనిమిదో తేదీన మినాలో ఏఏ నమాజ్‌లు చేశారు?

జ: ఎనిమిదో తేదీన జుహ్ర్, అస్ర్, మగ్రిబ్, ఇషా. తొమ్మిదో తేదీన నమాజె ఫజ్ర్ చేశారు.

ప్ర: హాజీలు మినాలో ఎక్కడ బస చేయడం అభిలషణీయం?

జ: మస్జిదె ఖీఫ్‌కు దగ్గర

ప్ర: ప్రవక్త(స) అరఫా రాత్రి ఎక్కడున్నారు?

జ: మినాలో

ప్ర: 'హజ్ చేసేవారు అరఫా రాత్రి మినాలో ఉండటం సున్నత్' అయితే జిల్‌హజ్ తొమ్మిదో తేదీన ఉదయం ప్రవక్త(స) ఎక్కడకు వెళ్ళాలని బయలుదేరారు?

జ: అరఫాత్ కోసం

ప్ర: అరఫాత్ మైదానం మక్కా నగరానికి ఎటువైపున ఉంది?

జ: మక్కాకు, మినాకు తూర్పు వైపు

ప్ర: మక్కానగరం నుండి అరఫాత్ ఎన్ని కి.మీ దూరంలో ఉంది?

జ: 16 కి.మి దూరంలో

ప్ర: అరఫాత్ మినా నుండి ఎన్ని కి.మీ దూరంలో ఉంది?

జ: ఐదు కి.మీ

ప్ర: అరఫాత్ మైదానం హరమ్ పరిధిలో ఉందా? లేదా హిల్ పరిధిలో ఉందా?

జ: హిల్ పరిధిలో

**ప్ర: ఇస్లాం చరిత్రలో అరఫాత్‌కు గల ప్రాముఖ్యత ఏమిటి?**

జ: కొన్ని ఉల్లేఖనాల ప్రకారం అరఫాత్ ప్రాంతంలో ఆదమ్(అ), హవ్వా (అలైహి)లు ఒకరినొకరు కలుసుకున్నారు. అక్కడే వారు ఒకరినొకరు గుర్తుపట్టారు.

**ప్ర: 'హజ్ చేసేవారు అరఫా రోజు ఉదయం మినానుండి అరఫాత్‌కు బయలు దేరి వెళ్ళడం సున్నత్. అయితే జిల్‌హజ్ తొమ్మిదో తేదీన ప్రవక్త(స) మినా నుండి అరఫాత్‌కు ఏ మార్గం నుండివెళ్ళారు?**

జ: జిబ్ ప్రాంతం నుండి (తక్బీర్) పలుకుతూ

**ప్ర: ప్రవక్త(స) మినా నుండి బయలుదేరి ముజ్దలిఫాహ్, అరఫాత్‌ల మధ్య ఎక్కడ బస చేశారు?**

జ: నమిర ప్రాంతంలో

**ప్ర: నమిర ప్రాంతం మినా, మక్కాలకు ఎటువైపు ఉంది?**

జ: తూర్పు వైపు

**ప్ర: మినానుండి నమిర ప్రాంతం ఎంత దూరంలో ఉంది?**

జ: 5 కి.మీ దూరంలో

**ప్ర: ఇస్లాం చరిత్రలో నమిరకున్న ప్రత్యేకత ఏమిటి?**

జ: అరఫాత్ మైదానం ఒడ్డున నమిర ప్రాంతంలో ఇబ్రాహీం(అ) నిర్మించిన ఒక మస్జిద్‌ఉంది. ఆ మస్జిద్‌కు మస్జిదె ఇబ్రాహీం లేదా మస్జిదె నమ్రా అంటారు.

**ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ తొమ్మిదో తేదీన నమిర ప్రాంతంలో ఎప్పటివరకు ఉన్నారు?**

జ: సూర్యాస్తమయం వరకు

**ప్ర: ప్రవక్త(స) సూర్యాస్తమయానికి ముందు ఏం చేశారు?**

జ : గుస్ల్ (స్నానం) చేశారు.

# హజ్జతుల్ విదా ప్రసంగం

ప్ర: 'హాజీలు అరఫాత్‌లో ప్రవేశించే ముందు గుస్ల్ లేదా వుజూ చేయడం అభిలషణీయం'. ప్రవక్త(స) జిల్‌హజ్ తొమ్మిదో తేదీ సూర్యాస్తమయం తర్వాత ఎక్కడకు వెళ్ళారు?

జ: అరఫాత్ మైదానం మధ్యలో.

ప్ర: ప్రవక్త(స) అరఫాత్ మైదానంలో ఎలా వెళ్ళారు?

జ: ఖస్వా అనే ఒంటె మీద

ప్ర: హి.శ. పదో యేడు జిల్‌హజ్ తొమ్మిదో తేదీన అరఫాత్ మైదానంలో ప్రవక్త(స) ఇచ్చిన సుదీర్ఘ ప్రసంగం ఇస్లాం చరిత్రలో ఏ పేరుతో ఖ్యాతి గడించింది?

జ: హజ్జతుల్ విదా.

ప్ర: ప్రవక్త(స) ప్రసంగం చేస్తున్న సందర్భంలో అక్కడ ఎంతమంది సహాబాలు ఉన్నారు?

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం ఒక లక్షా నలభై వేలు, మరో ఉల్లేఖనం ప్రకారం ఒక లక్షా నలభై నాలుగువేల సహాబాలు.

ప్ర: హజ్జతుల్ విదా ప్రసంగంలో ప్రవక్త(స) అజ్ఞానకాలంలోని వడ్డీలన్నింటిని నిషేధించారు. ప్రవక్త(స) మొదట తన కుటుంబంలోని ఏ వ్యక్తి వడ్డీని మాఫీ చేశారు?

జ: అబ్బాస్(రజి) బిన్ అబ్దుల్ ముత్తలిబ్

ప్ర: ప్రవక్త(స) హజ్జతుల్ విదా ప్రసంగంలో అజ్ఞానకాలంలోని అన్ని రక్త పరిహారాలను అసత్యమైనవిగా నిర్ణయించారు. మొదట ప్రవక్త (స) తన కుటుంబంలోని ఏ వ్యక్తి రక్తపరిహారాన్ని క్షమించి విడిచిపెట్టారు?

జ: రబీఅ బిన్ హారిస్ కొడుకు రక్తాన్ని.

ప్ర: ప్రవక్త(స) హజ్జతుల్ విదా ప్రసంగంలో మానవులందరినీ ఇస్లామీయ సోదర బంధంలో కలుపుతూ ఏమని ఉద్బోధించారు?

జ: ముస్లిం ముస్లింకు సోదరుడు. ముస్లిములు పరస్పరం సోదరులు.

ప్ర: హజ్జతుల్ విదా సందర్భంగా ప్రవక్త(స) మహిళలను ఉద్దేశించి ఏమని హితబోధ చేశారు?

జ: ప్రజలారా! స్త్రీల విషయంలో అల్లాహ్‌కు భయపడండి. స్త్రీలపై మీకు, మీపై స్త్రీలకు హక్కులున్నాయి.

ప్ర: బానిసలతో మంచిగా ప్రవర్తించాలని ఆదేశిస్తూ ప్రవక్త(స) ఏమన్నారు?

జ: 'మీ బానిస, మీ బానిస, మీరు తినేదే వారికి తినిపించండి. మీరు ధరించేదే వారికీ ఇవ్వండి.

ప్ర: ప్రపంచంలో శాంతి, సామరస్యాల కోసం ప్రవక్త(స) ఏమని బోధించారు?

జ: ఏవిధంగా ఈనెలలో, ఈ నగరంలో ఈ రోజు నిషిద్ధమో అదేవిధంగా మీ రక్తం, మీ ధనం, మీ మానమర్యాదలు ప్రళయదినం వరకు ఒకరికొకరిపై నిషిద్ధం.

ప్ర: ప్రపంచాన్ని మార్గభ్రష్టత నుండి రక్షించడానికి దేనిని గట్టిగా పట్టుకోమని ప్రవక్త(స) తాఖీదు చేశారు?

జ: దివ్యఖుర్ఆన్‌ను

ప్ర: వారసత్వానికి సంబంధించి ప్రతి హక్కుదారునికి హక్కు అందించాలని ఆదేశిస్తూ ప్రవక్త(స) ఏమని ప్రబోధించారు?

జ: 'వారసత్వపు హక్కులో వీలునామా సమంజసం కాదు'

ప్ర: హజ్‌ను ఇబ్రాహీం(అలైహి) సంప్రదాయంపై స్థిరంగా ఉంచడానికి

**ప్రవక్త(స) 'నసీ' విధానాన్ని శాస్వతంగా రూపుమాపాలని ప్రకటించారు. 'నసీ' అంటే ఏమిటి?**

జ: ఇబ్రాహీం(అలైహి) చంద్రమాన నెలల ఆధారంగా జిల్‌హజ్ నెలలో హజ్ చేయాలని నిర్ణయించారు. ఈ సంప్రదాయాన్ని నెలకొల్పాలంటే హజ్ వివిధ కాలాలలో వస్తుంది. ఈ విషయం మక్కా ఖురైషుల వ్యాపార ఉపయోగానికి వ్యతిరేకంగా ఉంది. అందుకని వారు 'నసీ' విధానాన్ని అనుసరించారు. అంటే నిషిద్ధ నెలలను వెనుకాముందు చేయడం కోసం చంద్రమాన సంవత్సరంలో పదకొండు రోజులను పెంచేవారు. చంద్రమాన సంవత్సరం, సూర్యమాన సంవత్సరానికి సమానంగా ఉండాలని. ఇలా చేయడం వల్ల చంద్రమాన నెలల కాలాలకనుగుణంగా వచ్చేవి. హజ్ వేసవి కాలంలోనే వచ్చేది. అలా మక్కా ఖురైషుల వ్యాపారం చక్కగా సాగేది. కాబట్టి ప్రవక్త(స) ఈ విధానాన్ని శాస్వతంగా రూపు మాపుతూ 'ఈ సంవత్సరం హజ్ ఏ విధంగా చేస్తున్నామో ప్రతి సంవత్సరం అదేవిధంగా చేయాలని' ప్రకటించారు.

ప్ర: **సూరె తౌబాలోని ఏ ఆయత్‌లో 'నసీ' ప్రస్తావన ఉంది?**

జ: 37వ ఆయత్‌లో

ప్ర: **హజ్జతుల్ విదా ప్రసంగంలో ప్రవక్త(స) ఇస్లాం మూల స్తంభాల గురించి ఏమని ఉపదేశించారు?**

జ: అల్లాహ్‌ను ఆరాధించండి. ఐదుపూటల నమాజ్ చేయండి. రమజాన్ నెలంతా ఉపవాసం ఉండండి, నా ఆదేశాలను పాటించండి, ఇలా చేస్తే స్వర్గంలో ప్రవేశిస్తారు.

ప్ర: **ప్రవక్త(స) హజ్జతుల్ విదా ప్రసంగంలో 'సమాజ అసమానత'ల గురించి ఏమని ప్రబోధించారు?**

జ: ప్రజలారా! నిశ్చయంగా మీ అందరి ప్రభువు ఒక్కడే. మీ తండ్రి కూడా

ఒక్కడే. వినండి.... అరబ్బులకు అరబ్బేతరులపై గాని, అరబ్బేతరులకు అరబ్బులపైగాని, తెల్లవారికి నల్లవారిపై, నల్లవారికి తెల్లవారిపై ఎలాంటి ప్రాముఖ్యత లేదు. కాని దైవభీతి కారణంగా మాత్రమే.

ప్ర: **ప్రవక్త(స) హజ్జతుల్ విదా ప్రసంగంలో ఇంకా ఎలాంటి నియమ నిబంధనలను ప్రకటించారు?**

జ: 1) ఎవరి పడకపై సంతానం కలుగుతుందో ఆ సంతానం వారిదే. వ్యభిచారిని రాళ్ళతో కొట్టాలి. వారి విషయం అల్లాహ్‌పై వదిలిపెట్టాలి.

2) తన తండ్రిని కాదని వేరే అతన్ని తన తండ్రిగా ప్రకటించినవాడు, తన యజమానిని కాదని వేరే వ్యక్తిని తన యజమాని అనే బానిస ఇరువురిని అల్లాహ్ శపిస్తాడు.

3) స్త్రీ తన భర్త అనుమతి లేనిదే భర్త ధనంనుండి ఇవ్వకూడదు. అప్పును చెల్లించాలి. అరువుగా తీసుకున్న వస్తువులు తిరిగి ఇచ్చేయాలి. కానుకను తిరిగి ఇవ్వొచ్చు. సాక్షి నష్టపరిహారానికి బాధ్యుడు.

ప్ర: **ప్రవక్త(స) ప్రసంగం ముగించేముందు సహాబాలతో ఏమని ప్రశ్నించారు?**

జ: 'ప్రజలారా! నేను అల్లాహ్ సందేశాన్ని మీ వద్దకు చేర్చానా? లేదా?'

ప్ర: **సహాబాలు ఏమని సమాధానమిచ్చారు?**

జ: అవును! మీరు అల్లాహ్ సందేశాన్ని మా వద్దకు చేర్చారు.

ప్ర: **అప్పుడు ప్రవక్త(స) ఆకాశంవైపు వేలెత్తి ఏమన్నారు?**

జ: ఓ అల్లాహ్! దీనికి నువ్వే సాక్షి.

ప్ర: **ప్రవక్త(స) 'ఓ అల్లాహ్! దీనికి నువ్వే సాక్షి!'. అనే వాక్యాన్ని ఎన్నిసార్లు పునరావృతం చేశారు?**

జ: మూడుసార్లు

ప్ర: **ప్రవక్త(స) సభకు హాజరైన వారికి అప్పగించిన బాధ్యత ఏమిటి?**

జ: 'ఈరోజు చేయబడిన బోధనలను ఇక్కడున్నవారు ఇక్కడలేని వారి వద్దకు చేర్చాలి.

**ప్ర: హజ్జతుల్ విదా సందర్భంగా ముకబ్బిర్ (తక్బీర్లు పలికే) విధుల్ని ఏ సహాబీ నిర్వహించారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం అలీ(రజి), రెండో ఉల్లేఖనం ప్రకారం రబీఅ బిన్ ఉమయ్యా ఖల్ఫ్(రజి)

**ప్ర: ప్రవక్త(స) తన మరణం గురించి సూచిస్తూ ఏమని పేర్కొన్నారు?**

జ: 'ప్రజలారా! నేనూ, మీరు మళ్ళీ ఈ సభలో కూర్చుంటామో? లేదో?

**ప్ర: ఈ సందర్భంగా అల్లాహ్ 'సంపూర్ణ ధర్మం' గురించి పేర్కొంటుంది. ఏ ఆయత్‌ను అవతరింపజేశాడు?**

జ: సూరె మాయిదాలోని 3వ ఆయత్ : 'అల్‌యౌమ అక్‌మల్‌తు లకుమ్ దీనకుమ్ వఅత్‌మమ్‌తు అలైకుమ్ నీమతీ వరజీతులకుముల్ ఇస్లామ దీనా.'

**ప్ర: ప్రవక్త(స) ప్రసంగం చివర ఒక దివ్యఖుర్‌ఆన్ ఆయత్ అవతరించింది. అందులో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : 'ఈరోజు ధర్మాన్ని పరిపూర్ణం చేశాను, నా అనుగ్రహాన్ని పూర్తిగా నెరవేర్చాను. ఇస్లాంను మీ జీవన ధర్మంగా ఆమోదించాను'. ఇది ఏ సూరాలో ఉంది?**

జ: సూరె మాయిదా. ఆయత్– 3

**ప్ర: ప్రవక్త(స) హజ్జతుల్ విదా సందర్భంగా మానవ ఐక్యత కోసం బోధించిన హితవులను సంక్షిప్తంగా తెలుపండి?**

జ: 'ప్రజలారా! మీ ప్రభువు ఒక్కడే. మీ తండ్రి కూడా ఒక్కడే. మీరందరూ ఆదం సంతానం. ఆదం(అ) మట్టితో సృజించబడ్డారు. మీలో దైవభీతిగల వాడే అల్లాహ్ వద్ద అత్యంత గౌరవపాత్రుడు. అరబ్బులకు అరబ్బేతరులపై, అరబ్బేతరులకు అరబ్బులపై ఎలాంటి ప్రాముఖ్యత లేదు. కేవలం

దైవభీతి కారణంగానే ప్రాముఖ్యత ఉంటుంది.

**ప్ర: ప్రసంగానంతరం ప్రవక్త(స) ఏ సహాబిని అజాన్ ఇవ్వమని పురమాయిం చారు?**

జ: హజ్రత్ బిలాల్ (రజి)ని.

**ప్ర: ప్రసంగానంతరం ప్రవక్త(స) నమ్రా మస్జిద్‌లో ఏ ఏ నమాజ్‌లను ఒకేసారి కలిపి చదివారు?**

జ: జుహ్ర్, అస్ర్ నమాజ్‌లు.

**ప్ర: ప్రవక్త(స) ఈ రెండు నమాజ్‌లు ఎప్పుడు చేశారు?**

జ: జుహ్ర్ నమాజ్ సమయంలో.

**ప్ర: రెండు నమాజుల సందర్భంగా ఎన్ని అజాన్‌లు, ఇఖామత్‌లు ఇవ్వడం జరిగింది?**

జ: ఒక్క అజాన్, రెండు ఇఖామత్‌లు ఇచ్చారు. నమాజ్‌లలో ఖస్ర్ చేశారు.

**ప్ర: అరఫాత్ పరిధిలో పదిహేను రోజులు ఉండాలనుకునే హాజీలు జొహర్, అసర్ నమాజ్‌లను ఏవిధంగా చేయాలి?**

జ: జొహర్, అసర్ నమాజులు వాటివాటి సమయానికి చదవాలి. ఒంటరిగా నైనా, సామూహికంగానైనా చేయొచ్చు.

**ప్ర: అరఫాత్ పరిధిలో జొహర్, అసర్ నమాజ్ చేయడం కోసం ప్రయాణికులు షరీఅత్‌లోని ఏ విధానాన్ని అనుసరించాలి?**

జ: అక్కడే నివాసముండే స్థానికుడిని ఇమామ్‌గా ఎంచుకుని అందరూ అతన్ని అనుసరించాలి.

**ప్ర: మస్జిద్ నమ్రా అరఫాత్ పరిధిలో ఉందా? బయట ఉందా?**

జ: అరఫాత్‌కు సరిహద్దుల్లో ఉంది.

**ప్ర: 'హాజీలు మస్జిదె నమ్రాలో జొహర్ సమయంలో జొహర్, అసర్**

**నమాజులను కలిపి ఒకేసారి చేయడం సున్నత్'. ఒకవేళ ఇక్కడ సామూహిక నమాజ్ చేసే అవకాశం లభిస్తే స్థానికులు, ప్రయాణికులు జొహర్, అసర్ నమాజ్‌లను ఒకేసారి ఏవిధంగా చేయాలి?**

జ: ఇమామ్ స్థానికుడైతే అరఫాలో రెండు నమాజులు పూర్తిగా చేయాలి. ముఖ్తదీలు (స్థానికులైనా, ప్రయాణికులైనా) కూడా పూర్తిగా నమాజ్ చేయాలి. ఒకవేళ ఇమామ్ ప్రయాణికుడైతే ఖసర్ చేయాలి. ముఖ్తదీలు కూడా ప్రయాణికులే అయితే వారు కూడా ఖసర్ చేయాలి. స్థానికులు ఖిరాత్ చేయకుండా మిగిలిన రెండు రకాతులను పూర్తి చేయాలి.

ప్ర: **ప్రవక్త(స) 'ఇది నా దుఆ, నాకంటే ముందు వచ్చిన ప్రవక్తల దుఆ అని చెప్పిన, అరఫాత్‌లో చదవాల్సిన దుఆ' ఏది?**

జ: లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహు లాషరీక లహూ లహుల్ ముల్కు వలహుల్ హమ్దు వహువ అలా కుల్లి షైయిన్ ఖదీర్.

**అర్థం :** అల్లాహ్ తప్ప ఆరాధ్య దైవం ఎవరూ లేరు. అతను ఒక్కడే. ఆయనకు భాగస్వాములు ఎవరూ లేరు. అధికారం అతనిదే. పొగడ్తలన్నీ అతని కొరకే. వస్తువులన్నీ అతని ఆధీనంలోనే ఉన్నాయి.

ప్ర: **ప్రవక్త(స) జొహర్, అసర్ నమాజులు ఒకేసారి చదివి ఎక్కడకు వెళ్ళారు?**

జ: జబలె రహ్మత్ దగ్గరకు.

ప్ర: **జబలె రహ్మత్ అంటే ఏమిటి? అది ఎక్కడ ఉంది?**

జ: అదొక పర్వతం పేరు. అది అరఫాత్ మైదానంలో ఉంది.

ప్ర: **ప్రవక్త(స) రహ్మత్ పర్వతం దగ్గర ఒంటెపై ఎప్పటివరకు ఉన్నారు?**

జ: సూర్యాస్తమయం వరకు.

ప్ర: **ప్రవక్త(స) రహ్మత్ పర్వతం దగ్గర ఏవిధంగా ఉన్నారు?**

జ: ప్రవక్త(స) ఖిబ్లావైపు ముఖం చేసి కూర్చుని ఒంటెపై దుఆ చేశారు. వినయ వినమ్రతలతో అక్కడ గడిపారు.

**ప్ర: వుఖూఫె అరఫాత్ అంటే ఏమిటి?**

జ: వుఖూఫ్ అంటే బస చేయడం. అరఫాత్ మైదానంలో జవాల్ (సూర్యుడు నడినెత్తి మీద వచ్చినప్పటి) నుండి సూర్యాస్తమయం వరకు ఉండటాన్ని 'వుఖూఫె అరఫాత్' అంటారు.

**ప్ర: అరఫాత్‌లో ఎప్పటి నుండి ఎప్పటివరకు ఉండాలి?**

జ: జిల్‌హజ్ తొమ్మిదో తేదీ మధ్యాహ్నం నుండి జిల్‌హజ్ పదో తేదీ ఉదయం వరకు.

**ప్ర: అల్లాహ్ ప్రతి పగటికి ఒక రాత్రిని సృష్టించాడు. అది పగటికంటే ముందు వస్తుంది. అయితే షరీఅత్ ప్రకారం ఒక పగటికి రాత్రి అనేది లేదు. అది ఏ పగలు?**

జ: యౌమున్నహర్. ఈ పగటికి రాత్రి లేదు. ఎందుకంటే యౌమున్నహర్ కంటే ముందు రాత్రి షరీఅత్ ప్రకారం అరఫా రాత్రిగానే పరిగణించబడుతుంది. అందుకే హాజీలు అరఫా రోజు అరఫాత్‌కు చేరలేకపోయినా ఆ రోజు రాత్రి ఏ సమయంలోనైనా లేదా ఉదయం వరకు అరఫాత్‌కు చేరుకున్నా అతను అరఫాత్‌లో వుఖూఫ్ (బస చేసినట్లుగానే) పరిగణించబడుతుంది. అతని హజ్ నెరవేరుతుంది.

**ప్ర: షరీఅత్ ప్రకారం రెండు రాత్రులు కలిగిన పగలు ఏది?**

జ: అరఫా రోజు– అంటే ఒక రాత్రి అరఫా కంటే ముందు రాత్రి, రెండోది అరఫా తర్వాతి రాత్రి

**ప్ర: షరీఅత్ ప్రకారం రాత్రి లేని పగలు ఏది?**

జ: యౌమున్నహర్. ఈ రోజుకు రాత్రి లేదు.

**ప్ర: 'బత్నెఉరా'లో తప్ప అరఫాత్ మైదానంలో ఎక్కడైనా వుఖూఫ్ (బస చేయడం) చేయొచ్చు' అని ప్రవక్త(స) ఎప్పుడు పేర్కొన్నారు?**

జ: బత్నె ఉర్నాలో కొందరు సహాబాలను చూసి.

ప్ర: ప్రవక్త(స) అరఫాత్ మైదానంలో తన సమాజీకుల పాపాలను క్షమించమని అల్లాహ్‌తో ప్రార్థించారు. అందులో ఏ దుఆ అల్లాహ్ స్వీకరించలేదు?

జ: దాసుల హక్కులు క్షమింపబడలేదు. ఎందుకంటే బాధితుడు దౌర్జన్యం చేసినవాడి నుండి హక్కును పొందుతాడు.

ప్ర: 'అరఫాత్ దుఆలు స్వీకరించబడే ప్రత్యేక స్థలం'. అక్కడ హాజీలు ఏవిధంగా ఉండాలి?

జ: ఖిబ్లావైపు తిరిగి అల్లాహ్‌ను స్తుతించాలి. దరూద్ షరీఫ్ పఠించాలి. దుఆలు చేయాలి. తల్బియా ఉచ్ఛరిస్తూ ఉండడం అభిలషణీయం.

ప్ర: హాజీలు అరఫాత్‌లో బస చేయడం గురించి ప్రవక్త(స) ఏమని ప్రబోధించారు?

జ: అరఫాత్‌లో బస చేయడమే హజ్.

ప్ర: ప్రవక్త(స) అరఫాత్ మైదానంలో ఉండగా ఒక మహిళ ఆయన(స) ఉపవాసాలు ఉన్నారో లేదో తెలుసుకోవాలని ఒక కప్పు పాలు పంపింది. ప్రవక్త(స) ఆ పాలను సేవించారు. 'పాలు పంపిన మహిళ పేరేమిటి?

జ: ఉమ్మె ఫజల్.

ప్ర: 'అరఫాత్‌లో బస చేయడం కోసం బహిష్టు, పురుటి రక్తస్రావం, అపరిశుద్ధత వంటి వాటి నుండి పరిశుభ్రంగా ఉండాలనే నిబంధన లేదు'. అయితే అరఫా రోజు మధ్యాహ్నం తర్వాత నుండి జిల్‌హజ్ పదో తేదీ ఉదయం వరకు ఎప్పుడైనా ఒక నిమిషం ఉండటాన్ని ఏమంటారు?

జ: హజ్‌లోని పెద్దకార్యం.

ప్ర: అరఫాత్‌లో హజీ తాను క్షమింపబడలేదు అని భావించడం గురించి ఏమని హెచ్చరించడం జరిగింది?

జ: పెద్ద పాపాత్ముడు అని

**ప్ర: 'హాజీలు సూర్యాస్తమయానికి ముందు అరఫాత్ పరిధి నుండి బయటకు వెళ్ళకూడదు' అయితే ప్రవక్త(స) అరఫాలో సూర్యాస్తమయం అయిన వెంటనే అరఫాత్ నుండి ఎక్కడకు బయలుదేరారు?**

జ: ముజ్దలిఫాకు (తల్బియా, తక్బీర్, దరూద్‌లు అధికంగా పఠిస్తూ వెళ్ళాలి)

**ప్ర: ఎవరయినా అరఫాత్ మైదానం నుండి సూర్యాస్తమయానికి ముందే బయలుదేరితే పరిహారంగా ఏం చెల్లించాలి?**

జ: ఒక మేకను లేదా గొర్రెను లేదా ఒంటెను, ఆవు ఏడో భాగాన్ని హరమ్ పరిధిలోనే జిబహ్ చేసి సద్ఖా (దానం) చేయాలి.

**ప్ర: ముజ్దలిఫా ఎక్కడుంది?**

జ: అరఫాత్ మరియు మినా మధ్యభాగంలోనున్న సువిశాల పర్వత ప్రాంతాన్ని 'ముజ్దలిఫా' అంటారు. అక్కడ హాజీలు జిల్‌హజ్ తొమ్మిదో, పదో రాత్రి ఉండాలి. మగ్రిబ్, ఇషా నమాజ్‌లను ఇషా సమయంలోనే ఒకే అజాన్ ఇఖామత్‌తో కలిపిచదువుతారు. ఉషోదయం నుండి సూర్యాస్తమయం వరకు కొంతసేపు వరకు అక్కడ బస చేయాలి.

**ప్ర: అరఫాత్ నుండి ముజ్దలిఫా ఎంత దూరంలో ఉంది?**

జ: ఐదు కిలోమీటర్లు.

**ప్ర: ముజ్దలిఫా హరమ్ పరిధిలో ఉందా?**

జ: హరమ్ పరిధిలోనే ఉంది.

**ప్ర: ఇస్లాం చరిత్రలో ముజ్దలిఫాకు ఉన్న ప్రాముఖ్యత ఏమిటి?**

జ: కొన్ని ఉల్లేఖనాల ప్రకారం ఆదం(అ), హవ్వా(అలై) ఒకరినొకరు అరఫాత్ మైదానంలోనే కలుసుకున్నారు. ముజ్దలిఫాలో రాత్రి కూడా గడిపారు.

**ప్ర: ప్రవక్త(స) ఒంటె మీద అరఫాత్ నుండి ముజ్దలిఫా ప్రయాణించేటప్పుడు ఆయన(స)తోపాటు ఎవరున్నారు?**

జ: ఉసామా బిన్ జైద్(రజి).

ప్ర: **ప్రవక్త(స) జిల్‌హజ్ పదో తేదీ రాత్రి ముజ్దలిఫాలో మగ్రిబ్, ఇషా నమాజ్‌లు ఏ సమయంలో చేశారు?**

జ: ఇషా సమయంలో.

ప్ర: **ప్రవక్త(స) నమాజ్‌లో ఏ విధానాన్ని అనుసరించారు?**

జ: ఖసర్ విధానాన్ని అనుసరించారు.

ప్ర: **ఈ నమాజ్ కోసం ఎన్ని అజాన్‌లు ఎన్ని తక్బీర్లు ఇచ్చారు?**

జ: ఒక్క అజాన్, ఒక్క తక్బీరు.

ప్ర: **ప్రవక్త(స) మగ్రిబ్, ఇషా నమాజులు చేసి ఎక్కడ బస చేశారు?**

జ: ముజ్దలిఫాలో.

ప్ర: **ముజ్దలిఫాలోని ఏ ప్రాంతంలో బస చేయకూడదు?**

జ: ముహస్సిర్ ప్రాంతంలో.

ప్ర: **'హాజీ ముజ్దలిఫాలో ఉండటం కోసం గుస్ల్ లేదా వుజూ చేయడం అభిలషణీయం. అక్కడ ఏవిధంగా మసలుకోవాలి?**

జ: ఖిబ్లా వైపు తిరిగి తక్బీర్లు, ఇస్తిగ్‌ఫార్, తల్బియా, దరూద్, తహ్లీల్ అధికంగా చదువుతూ ఉండాలి.

ప్ర: **మష్‌అరె హరమ్‌లో అధికంగా అల్లాహ్‌ను స్మరించాలని ఏ సూరాలో ఆదేశించడం జరిగింది?**

జ: బఖరహ్‌లోని 198వ ఆయత్‌లో

ప్ర: **'ముజ్దలిఫా రాత్రి, షబె ఖద్ర్‌కంటే మేలైంది' జిల్‌హజ్ పదో తేదీ శుభోదయం తర్వాత ప్రవక్త(స) ముజ్దలిఫాలో ఎక్కడున్నారు?**

జ: 'మష్‌అరెహరమ్'లో

ప్ర: **ప్రవక్త(స) ముజ్దలిఫాలో ఎప్పటి వరకు ఉన్నారు?**

జ: జిల్‌హజ్ పదో తేదీ ఉషోదయం తర్వాత నుండి సూర్యోదయం తర్వాత

కొంతసేపటి వరకు.

ప్ర: **'హజ్ వాజిబ్‌లలోని ఒక అంశం వుఖూఫె ముజ్దలిఫా' అయితే వుఖూఫె ముజ్దలిఫా అంటే ఏమిటి?**

జ: జిల్‌హజ్ పదో తేదీన ఉషోదయం తర్వాత నుండి సూర్యోదయం తర్వాత కొంతసేపటి వరకు ముజ్దలిఫాలో ఉండటాన్ని 'వుఖూఫె ముజ్దలిఫా' అంటారు.

ప్ర : **హాజీ ఎలాంటి కారణం లేకుండా ముజ్దలిఫాలో ఉండకపోతే పరిహారంగా ఏం చెల్లించాలి?**

జ : పరిహారంగా జంతువును జిబహ్ చేయడం తప్పనిసరి.

ప్ర : **అధిక సమూహం భయంతో ముజ్దలిఫాలో ఉండకపోయినా మినాకు వెళ్ళే అనుమతి ప్రవక్త(స) ఎవరెవరికి ఇచ్చారు?**

జ : స్త్రీలకు, పిల్లలకు, బలహీనులకేకాక, తమ కుటుంబసభ్యులకు.

ప్ర: **ప్రవక్త(స) కుటుంబసభ్యుల్లో ఎవరెవరికి మినా వెళ్ళేందుకు అనుమతి నిచ్చారు?**

జ: మాతృమూర్తి సౌదా(రజి.అన్‌హా), సల్మా (రజి.అన్‌హా), ఉమ్మె హబీబా (రజి.అన్‌హా) ఇంకా అబ్బాస్, ఆయన(రజి) సంతానానికి.

ప్ర: **మహిళలు అధిక సమూహం వల్ల ముజ్దలిఫాలో బస (వుఖూఫ్) చేయడం మానేయొచ్చా?**

జ: మానేయొచ్చు

ప్ర: **ముజ్దలిఫాలో ఉండటం (వుఖూఫ్) గురించి ప్రవక్త(స) ఏమని ఉపదేశించారు?**

జ: ముహస్సిర్ ప్రాంతం తప్ప ముజ్దలిఫాలో ఎక్కడైనా ఉండవచ్చు.

ప్ర: **'ముహస్సిర్ ప్రాంతంలో తప్ప ముజ్దలిఫాలో ఎక్కడైనా ఉండవచ్చు' అని ప్రవక్త(స) ఉపదేశించారు. దీనికి కారణం ఏమిటి?**

జ: ప్రవక్త(స) జన్మించకముందు కాబా గృహాన్ని కూల్చే ఉద్దేశంతో అబ్రహా, అతని సైనికులొచ్చారు. అల్లాహ్ ఈ ప్రాంతంలో అబాబీల్ పిట్టల ద్వారా వారిపైన తన శిక్షను అవతరింపజేశాడు. దీని ప్రస్తావన సూరెఫీల్‌లో ఉంది.

**ప్ర: ప్రవక్త(స) ముజ్దలిఫాలో తన సమాజీకుల పాపాల మన్నింపు కొరకు దుఆ చేస్తే ఏ పాపాలు క్షమించబడతాయని శుభవార్త ఇవ్వబడింది?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం దాసుల హక్కులు క్షమించబడతాయని.

**ప్ర: ప్రవక్త(స) ముజ్దలిఫా నుండి ఎక్కడకు వెళ్ళాలని బయలుదేరారు?**

జ: ఫజ్ర్ నమాజ్ తర్వాత సూర్యోదయానికి ముందు మినా వెళ్ళాలని బయలు దేరారు.

**ప్ర: ముజ్దలిఫా నుండి మినా ఎంతదూరంలో ఉంది?**

జ: ఐదు కిలోమీటర్లు

**ప్ర: ప్రవక్త(స) ముజ్దలిఫా నుండి మినాకు వెళ్ళాలని ఎప్పుడు బయలుదేరారు?**

జ: సూర్యోదయానికి ముందు

**ప్ర: ఈ ప్రయాణంలో ప్రవక్త(స)తోపాటు ఒంటెపై ఉన్న మరో సహాబీ ఎవరు?**

జ: ఫజల్ బిన్ అబ్బాస్(రజి).

**ప్ర: మినా ప్రయాణ మార్గమధ్యంలో ఒక సహాబీ ప్రవక్త(స)తో 'నా తల్లి చాలా వృద్ధురాలు. ఆమెను వాహనంపై తీసుకెళితే చనిపోతుందేమోనని భయంగా ఉంది. నేను నా తల్లి తరఫు నుండి హజ్ చేయవచ్చా?' అని అడిగారు. దానికి ప్రవక్త(స) ఏమని జవాబిచ్చారు?**

జ: నీ తల్లి ఎవరికైనా అప్పు ఇవ్వాల్సి ఉంటే దానిని నువ్వు చెల్లిస్తావు కదా. అదేవిధంగా హజ్ కూడాను.

**ప్ర: ప్రవక్త(స) ముజ్దలిఫా నుండి మినాకు వెళ్తుంటే మార్గమధ్యంలో బనీ ఖష్ అమ్ తెగ మహిళ ' నా తల్లిదండ్రులపై హజ్ వాజిబ్ అయింది. వారు**

**చాలా వృద్ధులు. వాహనంపై ఎక్కి వెళ్ళి హజ్ చేసే శక్తి వారికి లేదు. వారి తరఫు నుండి నేను హజ్ చేయనా?' అని ప్రవక్త(స)ను విన్నవించుకుంది. ప్రవక్త(స) ఆమెకు ఏమని సమాధానమిచ్చారు?**

జ: వారికి బదులు హజ్ చేయవచ్చు. దీనినే 'హజ్జె బదల్' అంటారు.

**ప్ర: ప్రవక్త(స) ముజ్దలిఫా నుండి మినాకు వెళ్ళే సమయంలో ఏ సహాబీ రాళ్ళు ఏరి తెచ్చి ఇచ్చారు?**

జ: ఫజల్ బిన్ అబ్బాస్(రజి)

**ప్ర: ఫజల్ బిన్ అబ్బాస్(రజి) ప్రవక్త(స)కు ఎన్ని గులకరాళ్ళు ఇచ్చారు?**

జ: కొన్ని ఉల్లేఖనాల ప్రకారం ఏడు. మరికొన్ని ఉల్లేఖనాల ప్రకారం డెబ్బై రాళ్ళు

**ప్ర: ముజ్దలిఫా నుండి మినాకు వెళ్ళే మార్గంలో ప్రవక్త(స) ఏ ప్రాంతంలో వడివడిగా నడవమని ఆదేశించారు?**

జ: ముహస్సిర్ ప్రాంతం

**ప్ర: ప్రవక్త(స) మినా చేరుకుని హజ్‌లోని ఏ కార్యక్రమాన్ని నిర్వహించారు?**

జ: రమియె జిమార్

**ప్ర: రమియె జిమార్ అంటే ఏమిటి?**

జ: రమీ అంటే విసరడం, రువ్వడం అని అర్థం. జిమార్ అంటే గులకరాళ్ళు. షరీఅత్ నిర్వచనం ప్రకారం మినాలో రాళ్ళతో చేయబడ్డ స్థంభాలపై గులకరాళ్ళు విసిరే ప్రక్రియను 'రమియె జిమార్' అంటారు. జమ్రహ్‌కు బహువచనాలు జిమార్, జిమారాత్.

**ప్ర: మినాలో రాళ్ళతో చేయబడ్డ చిన్న, పెద్ద, మధ్య షైతాన్‌లు అనబడే స్థంభాల పేర్లు తెలుపండి?**

జ: మక్కా వైపు ఉన్న స్తంభాన్ని 'జమరతుల్ అఖ్‌బా' అంటారు. మధ్యలో ఉన్న స్తంభాన్ని 'జమ్రతుల్ వుస్తా' అంటారు. మస్జిదె ఖీఫ్ సమీపంలో ఉన్న

స్తంభాన్ని 'జమ్రతుల్ ఊలా' అంటారు. ఈ మూడు స్థంభాలను కలిపి 'జమ్రతుల్ సలాస' అంటారు.

**ప్ర: ప్రవక్త(స) మూడు స్థంభాల్లో మొదట ఏ స్థంభంపై గులకరాళ్ళు విసిరారు?**

జ: జమ్రతుల్ ఉఖ్బా అనే పెద్దరాయిపై.

**ప్ర: ప్రవక్త(స) ఏ సమయంలో జమ్రతుల్ ఉఖ్బాపై రాళ్ళు విసిరారు?**

జ: సూర్యుడు నడినెత్తి నుండి వాలే ముందు.

**ప్ర: ప్రవక్త(స) జమ్రతుల్ ఉఖ్బాపై ఎన్నిరాళ్ళు విసిరారు?**

జ: ఏడు రాళ్ళు

**ప్ర: జమ్రతుల్ ఉఖ్బాపై రాళ్ళు విసిరేటప్పుడు ప్రవక్త(స) ఎక్కడున్నారు?**

జ: ఖస్వా అనే ఒంటెపై.

**ప్ర: ప్రవక్త(స) మినాలో తల్బియా పఠించడం ఎప్పుడు ఆపారు?**

జ: కొన్ని ఉల్లేఖనాల ప్రకారం జమ్రతుల్ ఉఖ్పై మొదటిరాయి విసిరేముందు అని, మరో ఉల్లేఖనంలో రమీ పూర్తయిన తర్వాత అని ఉంది.

**ప్ర: జమ్రతుల్ ఉఖ్బాపై ఎప్పటినుండి ఎప్పటివరకు రాళ్ళు విసరవచ్చు?**

జ: జిల్‌హజ్ పదో తేదీ సూర్యోదయం నుండి సూర్యుడు నడినెత్తినుండి కిందికి వాలే వరకు విసరడం సున్నత్. అప్పటినుండి సూర్యాస్తమయం వరకు విసరడం అభిలషణీయం. సూర్యాస్తమయం నుండి రెండోరోజు ఫజర్ వరకు విసరడం మక్రూహ్.

**ప్ర: ప్రవక్త(స) రమీ చేస్తూ ఏ తక్బీర్ పఠించారు?**

జ: 'బిస్మిల్లాహి అల్లాహుఅక్బర్, రగ్‌మన్ లిల్ షైతాని వ రజన్ లిల్ రహ్మాన్'

**ప్ర: ఈ దుఆ భావం ఏమిటి?**

జ: నేను అల్లాహ్ పేరుతో రాళ్ళు విసురుతున్నాను. అల్లాహ్ అందరికంటే

గొప్పవాడు. షైతాన్‌ను కించపరచడానికి, కరుణామయుని సంతోషం కోసం రాళ్ళు విసురుతున్నాను.

**ప్ర: రమీ చేసేటప్పుడు రాళ్ళను ఏవిధంగా పట్టుకోవడం ఉత్తమం?**

జ: కుడిచేయి బొటనవ్రేలు, చూపుడు వేళ్ళతో, లేదంటే ఎలా అయినా పట్టుకోవచ్చు.

**ప్ర: జమ్‌రె ఉఖ్‌బాపై రాళ్ళు విసిరేటప్పుడు ఎలా నించోవడం ఉత్తమం?**

జ: హాజి కుడిభుజం మినావైపు, ఎడమ భుజం కాబావైపు ఉండేలా జమ్‌ర ముందు నించోవాలి.

**ప్ర: ప్రవక్త(స) జమ్‌రె ఉఖ్‌బాపై రాళ్ళు విసిరి ఎక్కడకు వెళ్ళారు?**

జ: రమీ చేసిన వెంటనే తన నివాస స్థలానికి వెళ్ళారు.

**ప్ర: జమ్‌రె ఉఖ్‌బా (పెద్ద షైతాన్)పై రాళ్ళు విసిరిన తర్వాత ప్రవక్త(స) ఏమని నిర్ణయించుకున్నారు?**

జ: ఖుర్బానీ చేయాలని.

**ప్ర: ప్రవక్త(స) ఎన్ని ఒంటెలను జిబహ్ చేశారు?**

జ: 63 ఒంటెలను.

**ప్ర: ఉల్లేఖనాల ప్రకారం హజ్ ప్రయాణంలో వంద ఒంటెలున్నాయి. అందులో ప్రవక్త(స) 63ఒంటెలను మాత్రమే జిబహ్ చేశారు. కారణమేమిటి?**

జ: ప్రవక్త(స) హజ్ చేసేటప్పుడు ఆయనకు 63సంవత్సరాలు. అందుకుగాను జీవితంలోని ప్రతి సంవత్సరానికి కృతజ్ఞతగా 63 ఒంటెలను జిబహ్ చేశారు.

**ప్ర: వంద ఒంటెలలో ప్రవక్త(స) 63 ఒంటెలను మాత్రమే జిబహ్ చేశారు. మిగతా ఒంటెలను ఎవరు జిబహ్ చేశారు?**

జ: అలీ(రజి).

**ప్ర: మినాలో ఏ రకమయిన హాజీలు తప్పనిసరిగా ఖుర్బానీ చేయాలి?**

జ: ఖారిన్, ముతమత్తు హాజీలు

**ప్ర: 'ఖారిన్, ముతమత్తు హాజీలు తప్పనిసరిగా ఖుర్బానీ ఇవ్వాలి' కారణమేమిటి?**

జ: ఖారిన్, ముతమత్తులు హజ్, ఉమ్రాలు ఒకేసారి చేస్తారు కాబట్టి కృతజ్ఞతగా ఖుర్బానీ ఇవ్వడం తప్పనిసరి (వాజిబ్).

**ప్ర: 'హజ్, ఉమ్రాలు ఒకేసారి చేసినందుకు తప్పనిసరిగా ఖుర్బానీ ఇవ్వాలి' దీనిని షరీఅత్ పరిభాషలో ఏమంటారు?**

జ: దమె షుక్ర్ (కృతజ్ఞతగా ఇచ్చే ఖుర్బానీ).

**ప్ర: అయ్యామె నహర్ అంటే ఏమిటి?**

జ: జంతువులను ఖుర్బానీ ఇచ్చేరోజును అయ్యాయె నహర్ అంటారు.

**ప్ర: జిల్‌హజ్‌లోని ఏ రోజులను అయ్యామె నహర్ అంటారు?**

జ: జిల్‌హజ్ పది, పదకొండు, పన్నెండు తేదీ.

**ప్ర: హాజీలు అయ్యామె నహర్‌లో ఏ రోజు ఖుర్బానీ ఇవ్వడం ఉత్తమం?**

జ: జిల్‌హజ్ పదో తేదీ.

**ప్ర: హాజీలు కృతజ్ఞతగా ఇచ్చే ఖుర్బానీ (దమె షుక్ర్) ఎక్కడ ఇవ్వాలి?**

జ: హరమ్ పరిధిలో– లేదంటే ఖుర్బానీ నెరవేరదు.

**ప్ర: అయ్యామె నహర్‌లో ఖుర్బానీ సమయం ఎప్పటివరకు ఉంటుంది?**

జ: జిల్‌హజ్ 10,11,12 తేదీ అసర్ వరకు.

**ప్ర: ముతమత్తు మరియు ఖారిన్‌లు అయ్యామె నహర్ రోజు ఖుర్బానీ చేయలేకపోతే పరిహారంగా ఏం చేయాలి?**

జ: పదిరోజులు ఉపవాసాలు ఉండాలి.

**ప్ర: పదిరోజుల ఉపవాసాలు ఎలా ఉండాలి?**

జ: అరఫా రోజుకంటే ముందు మూడు ఉపవాసాలు ఉండాలి. మిగతా రోజాలు ఇంటికెళ్ళి ఉండాలి.

**ప్ర: 'ముతమత్తు, ఖారిన్‌లు నహర్ రోజు ఖుర్బానీ చేయలేకపోతే పదిరోజుల ఉపవాసాలు ఉండాలి' అనే ఆదేశం దివ్యఖుర్ఆన్‌లోని ఏ సూరాలో ఉంది?**

జ: సూరె బఖరహ్‌లోని 196వ ఆయత్.

**ప్ర: ఏ రకమయిన హజ్ చేసేవారు మినాలో ఖుర్బాని ఇవ్వాలి?**

జ: ముఫ్రద్ హజ్ చేసేవారు.

**ప్ర: ప్రవక్త(స) ఒంటెను ఎలా జిబహ్ చేశారు?**

జ: ఒంటె ఎడమకాలు కట్టేసి, గొంతుపై ఈటెతో కొట్టి జిబహ్ చేశారు.

**ప్ర: ప్రవక్త(స) తన సతీమణుల తరఫు నుండి ఎన్ని జంతువులను జిబహ్ చేశారు?**

జ: ఉల్లేఖనాల ప్రకారం ఒక జంతువు ఆయిషా(రజిఅన్‌హా) తరఫు నుండి మరో జంతువు సతీమణులందరి తరఫు నుండి.

**ప్ర: జిబహ్ చేసిన మాంసం వినియోగించుకోవడం గురించి ప్రవక్త(స) ఏమని ఆదేశించారు?**

జ: ఖుర్బానీ జంతువుల మాంసం నుండి ఒక ముక్క తీసుకొని ఉపయోగించుకోవాలి.

**ప్ర: 'హాజీలు కృతజ్ఞతగా ఇచ్చిన ఖుర్బానీ మాంసం తినొచ్చు' మరి దోష పరిహారం (దమె జినాయత్)కు సంబంధించిన ఆదేశాలేమిటి?**

జ: దమె జినాయత్ (దోష పరిహారం) నుండి తినకూడదు. అలాంటి మాంసాన్ని అనాధలకు పంచిపెట్టాలి.

**ప్ర: దమె జినాయత్ అంటే ఏమిటి?**

జ: జినాయత్ అంటే దోషము, లోపం, పొరపాటులాంటి అర్థాలున్నాయి. హజ్ కార్యకలాపాల్లో ఏమైనా పొరపాట్లు జరిగితే పరిహారంగా జంతు వును జిబహ్ చేయాలి. దానినే 'దమ్'అంటారు. అంటే హజ్ కార్యకలా పాలలో జరిగిన పొరపాటును పూడ్చుడానికి జంతువును జిబహ్ చేయ డాన్ని 'దమె జినాయత్' అంటారు.

**ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ పదో తేదీన ఖుర్బానీ ముగించుకొని మినా ప్రాంతానికి సంబంధించి ఏమని ప్రబోధించారు?**

జ: నేను వధశాలలో ఖుర్బానీ ఇచ్చాను. మినా ప్రాంతమంతా ఎక్కడైనా ఖుర్బానీ ఇవ్వొచ్చు. మినాలో ప్రత్యేక ప్రాంతంలోనే ఖుర్బానీ ఇవ్వాలనే ఆంక్ష లేదు. హరమ్ పరిధిలో ఖుర్బానీ ఎక్కడైనా ఇవ్వొచ్చు.

**ప్ర: ప్రవక్త(స) ఖుర్బానీ ఇచ్చి ఏమని సంకల్పం చేసుకున్నారు?**

జ: తల గొరిగించుకోవాలని.

**ప్ర: 'హాజీ జమ్రె ఉఖ్‌బా, రమీ, ఖుర్బానీ, మరియు తల గొరిగించుకోవడంలో క్రమం తప్పకూడదు' అయితే ప్రవక్త(స) తలగొరికే అవకాశం ఎవరికి లభించింది?**

జ: మువమ్మర్ బిన్ అబ్దుల్లా (రజి).

**ప్ర: 'హాజీ హరమ్ పరిధిలో ఉండి నహర్‌రోజుల్లో తల గొరిగించుకోవడం తప్పనిసరి' ప్రవక్త(స) మొదట తన తలను ఎటువైపు నుంచి గొరిగించుకున్నారు?**

జ: కుడివైపు నుండి.

**ప్ర: ప్రవక్త(స) తల గొరిగించుకుని వెంట్రుకలు ఎవరికి ఇచ్చారు?**

జ: అబూ తల్‌హా అన్సారీ(రజి) గారికి

**ప్ర: జిల్‌హజ్ పదో తేదీన తల గొరిగించుకున్నవారి క్షమాభిక్ష కోసం ప్రవక్త(స) ఎన్నిసార్లు దుఆ చేశారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం రెండుసార్లు, మరో ఉల్లేఖనం ప్రకారం మూడు సార్లు.

**ప్ర: మినాలో అవతరించిన సూరా పేరేమిటి?**

జ: ముర్‌సలాత్

**ప్ర: హాజీ తల గొరిగించుకోగానే తహల్లుల్ అవుతాడు. అసలు తహల్లుల్ అంటే ఏమిటి?**

జ: హాజీ ఇహ్రామ్ ధరించి ఉన్నప్పుడు అతనిపై కొన్ని వస్తువులు నిషేధం అవుతాయి. హాజీ తల గొరిగించుకున్న తర్వాత సంభోగించడం, వేటాడటం తప్ప అన్నీ ధర్మసమ్మతమవుతాయి. సమ్మతమయ్యే ప్రక్రియను 'తహల్లుల్' అంటారు.

**ప్ర: ప్రవక్త(స) తలవెంట్రుకలు తీయించుకున్న తర్వాత ఎక్కడకు వెళ్ళారు?**

జ: మక్కా నగరానికి

**ప్ర: ప్రవక్త(స) మక్కాకు ఎందుకు వెళ్ళారు?**

జ: తవాఫ్ చేయడం కోసం.

**ప్ర: ప్రవక్త(స) మక్కాలో తవాఫ్ చేయడానికి ఏ దుస్తులతో వెళ్ళారు?**

జ: రోజువారి దుస్తులకు సుగంధం పూసుకుని వెళ్ళారు. ఎందుకంటే తలవెంట్రుకలు తీయించుకున్న తర్వాత ప్రవక్త(స) ఇహ్రామ్ తీసేశారు.

**ప్ర: ప్రవక్త(స) తవాఫ్ చేయడానికి ఏ సమయంలో వెళ్ళారు?**

జ: మధ్యాహ్నానికి ముందు.

**ప్ర: 'జిల్‌హజ్ పదో తేదీన రమీ చేసి, ఖుర్బానీ చేసి, తలగొరించుకున్న తర్వాత తవాఫ్ చేయడానికి హాజీలు మక్కా నగరానికి వెళ్ళడం సున్నత్' అయితే తవాఫ్ సమయం ఎప్పటినుండి ఎప్పటివరకు ఉంటుంది?**

జ: జిల్‌హజ్ పదో తేదీ శుభోదయం నుండి జల్‌హజ్ 12వ తేదీ సూర్యాస్తమయం వరకు ఉంటుంది. ఆ తర్వాత పరిహారం చెల్లించాలి.

**ప్ర: ప్రవక్త(స) ఏవిధంగా తవాఫ్ చేశారు?**

జ: రమల్ చేయకుండానే ప్రవక్త(స) ఏడు ప్రదక్షిణలతో తవాఫ్ చేశారు.

**ప్ర: ప్రవక్త(స) తవాఫ్ ఎలా చేశారు?**

జ: ఖస్వా అనే ఒంటెపై.

**ప్ర: ప్రవక్త(స) తవాఫ్ చేసిన తర్వాత సయీ చేశారా? లేదా?**

జ: ప్రవక్త(స) సయీ చేశారా, లేదా అనే విషయంపై భిన్నాభిప్రాయాలున్నాయి.

**ప్ర: ప్రవక్త(స) తవాఫ్ చేస్తూ ఏం చేశారు?**

జ: మొదటి మూడు చుట్లలో రమీ చేశారు. మిగతా చుట్లలో రమీ చేయలేదు.

**ప్ర: సయీ ఇహ్రామ్ ధరించి చేయాలా? ధరించకుండానే చేయాలా?**

జ: హాజీ తలవెంట్రుకలు తొలగించుకున్న తర్వాత ఇహ్రామ్ తీసివేస్తే ఇహ్రామ్ లేకుండానే సయీ చేయవచ్చు. లేదంటే ఇహ్రామ్‌తోనే చేయాలి.

**ప్ర: హాజీ రెండో తహల్లుల్ ఎప్పుడు పొందుతాడు?**

జ: తవాఫ్ చేసిన తర్వాత.

**ప్ర: రెండో తహల్లుల్ అంటే ఏమిటి?**

జ: హాజీ సంభోగం చేయడం, వేటాడటం ధర్మసమ్మతమవడాన్ని రెండో తహల్లుల్ అంటారు.

**ప్ర: 'తవాఫ్ చేయడం ఫర్జ్. అది చేయనిదే హజ్ పూర్తి కాదు' అయితే హాజీ తవాఫ్‌లోని అధిక ప్రదక్షిణాలు లేదా పూర్తిగా ప్రదక్షిణలు వదిలిపెడితే పరిహారంగా ఏం చేయాలి?**

జ: మిగతా జీవితంలో మరోసారి తవాఫ్ చేయనంత వరకు స్త్రీ ధర్మసమ్మతం కాదు.

**ప్ర: ప్రవక్త(స) తవాఫ్ చేసిన తర్వాత ఏం చేశారు?**

జ: నమాజ్ చేశారు.

ప్ర: **'హాజీ తవాఫ్ చేసిన తర్వాత తప్పనిసరిగా నమాజ్ చేయాలి' ప్రవక్త(స) నమాజ్ చేసి ఎక్కడకెళ్ళారు?**

జ: జమ్‌జమ్ బావి దగ్గరకు.

ప్ర: **ప్రవక్త(స)కు జమ్‌జమ్ నీరు ఎవరు అందించారు?**

జ: ఫజల్ బిన్ అబ్బాస్(రజి).

ప్ర: **ప్రవక్త(స) జమ్‌జమ్ నీరు సేవించి ఏమని ప్రబోధించారు?**

జ: 'నేను స్వయంగా నీళ్ళు తోడేవాడిని, కాని నన్ను నీళ్ళు తోడటం చూసి అందరూ మీపై ఎగబడతారని తోడలేదు.'

ప్ర: **జమ్‌జమ్ నీరు సేవించిన తర్వాత ప్రవక్త(స) ఎక్కడకు వెళ్ళారు?**

జ: తిరిగి మినాకు వెళ్ళారు.

ప్ర: **తవాఫ్‌ను ఇంకా ఏ పేర్లతో పిలుస్తారు?**

జ: తవాఫె రుకున్, తవాఫె హజ్, తవాఫె ఇజాఫ

ప్ర: **జిల్‌హజ్ పదో తేదీన తవాఫ్ చేసిన తర్వాత మినాకు వెళ్ళి తష్రీక్ రోజుల్లో ప్రవక్త(స) ఎక్కడున్నారు?**

జ: మినాలో

ప్ర: **తష్రీక్ రోజులు అంటే ఏమిటి?**

జ: జిల్‌హజ్ తొమ్మిదో తేదీ నుండి పదమూడో తేదీ వరకు ఐదు రోజులను తష్రీక్ రోజులు అంటారు. ఈ ఐదురోజుల్లో తక్బీరె తష్రీక్‌లు పఠిస్తారు. అందుకనే ఈ ఐదురోజులను 'అయ్యామె తష్రీక్' అంటారు.

ప్ర: **తష్రీక్ రోజుల్లో ప్రతి ఫర్జ్ నమాజ్ తర్వాత పఠించబడే తక్బీరు ఏది?**

జ: అల్లాహుఅక్బర్ అల్లాహుఅక్బర్ లాఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ వలిల్లాహిల్ హమ్ద్

**ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ పదకొండో తేదీన హజ్‌లోని ఏ ఫర్జ్‌లను పాటించారు?**

జ: జమ్రె సలాస (మూడు షైతాన్)లపై రాళ్ళు విసిరారు.

**ప్ర: 'జమ్రె సలాసపై రాళ్ళు విసిరినప్పుడు వుజూతో ఉండటం ఉత్తమం' అయితే ప్రవక్త(స) జమ్రె సలాసపై రాళ్ళు విసిరినప్పుడు ఏ స్థితిలో ఉన్నారు?**

జ: నడుస్తూ ఉన్నారు.

**ప్ర: ప్రవక్త(స) ఏ సమయంలో రమీ చేశారు?**

జ: సూర్యోదయం తర్వాత.

**ప్ర: జమ్రె సలాసను రమీచేసే సమయం ఎప్పటివరకు ఉంటుంది?**

జ: జిల్‌హజ్ 11, 12 తేదీ మధ్యాహ్నం నుండి సూర్యాస్తమయం వరకు సున్నత్. రెండోరోజు ఉదయం వరకు అవాంఛనీయం (మక్రూహ్). ఆ తర్వాత ఖజా మరియు పరిహారం తప్పనిసరి.

**ప్ర: జిల్‌హజ్ పదకొండో తేదీ సూర్యుడు నడినెత్తి నుండి కిందికి వాలిన తర్వాత ప్రవక్త(స) ఏ జమ్‌ర (షైతాన్)ను రమి చేశారు?**

జ: జమ్‌రె ఊలా (పెద్ద షైతాన్‌ను)

**ప్ర: ప్రవక్త(స) జమ్‌రె ఊలాపై ఎన్ని కంకరరాళ్ళు విసిరారు?**

జ: ఏడు విడివిడి రాళ్ళు.

**ప్ర: రాళ్ళు విసిరేటప్పుడు ప్రవక్త(స) ఏ తక్బీర్ పఠించారు?**

జ: 'బిస్మిల్లాహి అల్లాహుఅక్బర్'

**ప్ర: ప్రవక్త(స) రమీ తర్వాత ఏం చేశారు?**

జ: జమ్రె ఊలాకు ఎడమవైపు వెళ్ళి ఖిబ్లా వైపు ముఖంచేసి చేతులెత్తి అల్లాహ్‌ను స్తుతిస్తూ, తక్బీర్లు పఠిస్తూ తహ్‌లీల్‌లో లీనమయ్యారు.

**ప్ర: ప్రవక్త(స) జమ్రె ఊలాను రమీ చేసిన తర్వాత ఏ జమ్రను రమీ చేశారు?**

జ: జమ్రె ఉస్తా

**ప్ర: ప్రవక్త(స) జమ్రె ఉస్తాను రమీ చేసి ఏంచేశారు?**

జ: జమ్రె ఊలా మాదిరిగానే ప్రార్థనలో లీనమయ్యారు.

**ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ పదకొండో తేదీన జమ్రె ఊలా, జమ్రె ఉస్తాలను రమీ చేసిన తర్వాత ఏ జమ్రాను రమీ చేశారు?**

జ: జమ్రె ఉఖ్బా

**ప్ర: ప్రవక్త(స) జమ్రె ఉఖ్బాను రమీచేసిన తర్వాత ఏంచేశారు?**

జ: రమీచేసిన వెంటనే ప్రవక్త(స) తన నివాస స్థలానికి వెళ్ళిపోయారు.

**ప్ర: జమ్రె సలాసపై ప్రవక్త(స) మొత్తం ఎన్ని గులకరాళ్ళు విసిరారు?**

జ: ప్రతి జమ్రా (షైతాన్)పై ఏడు రాళ్ళు విసిరారు. మొత్తం మూడు జమ్రాలపై ఏడేడు చొప్పున 21రాళ్ళు విసిరారు.

**ప్ర: హాజి జిల్‌హజ్ పన్నెండో తేదీరోజు రమీ ఏవిధంగా చేయాలి?**

జ: జిల్‌హజ్ పదకొండో తేదీన చేసిన విధంగా

**ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ పన్నెండో తేదీన జమ్రతుస్సలాసపై ఎన్ని రాళ్ళు విసిరారు?**

జ: 21 రాళ్ళు

**ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ పదమూడో తేదీన జమ్రతుస్సలాసపై ఎన్ని రాళ్ళు విసిరారు?**

జ: 21 రాళ్ళు

**ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ 11,12,13 తేదీల్లో జమ్రతుస్సలాసకు మొత్తం ఎన్ని రాళ్ళు విసిరారు?**

జ: 21+21+21= 63

**ప్ర: ప్రవక్త(స) జిల్‌హజ్ 12వ తేదీన హాజీలను మక్కాకు వెళ్ళమని అనుమతి నిచ్చారు. కాని ఆయన(స) మాత్రం త్వరగా వెళ్ళలేదు ఎందుకు?**

జ: ప్రవక్త(స) జిల్‌హజ్ పదమూడో తేదీన కూడా జమ్‌రతుస్సలాసకు రమీ చేశారు.

**ప్ర: ప్రవక్త(స) సూరె బఖరహ్‌లోని ఏ ఆయత్‌ను అనుకరిస్తూ హాజీలను మక్కాకు వెళ్ళమని అనుమతినిచ్చారు?**

జ: సూరె బఖరహ్‌లోని 203వ ఆయత్

**ప్ర: జిల్‌హజ్ పన్నెండో తేదీన హాజీలు జమ్రతుస్సలాసకు రాళ్ళు కొట్టిన తర్వాత మక్కా వెళ్ళాలనుకుంటే మినా నుండి ఎప్పుడు బయలుదేరాలి?**

జ: సూర్యాస్తమయానికి ముందు బయలుదేరాలి. సూర్యాస్తమయం తరువాత బయలుదేరినా అభ్యంతరం లేదు.

**ప్ర: జిల్‌హజ్ పన్నెండో తేదీ రమీ పూర్తిచేసుకున్న హాజీలు జిల్‌హజ్ పదమూడో తేదీ ఉదయం వరకు మినాలోనే ఉండిపోతే అలాంటివారి రమీయె జిమార్ గురించి ఏమని ఆదేశించడం జరిగింది?**

జ: జిల్‌హజ్ పదమూడో తేదీ సూర్యాస్తమయం వరకు మూడు జమ్రాలను రమీ చేయడం తప్పనిసరి. సూర్యాస్తమయం తర్వాత రమీ చేసే సమయం పూర్తవుతుంది. దానికి ఖజా లేదు. రమీ చేయకుండాపోతే తప్పనిసరిగా పరిహారం చెల్లించాలి.

**ప్ర: స్త్రీలు, వృద్ధులు, రోగగ్రస్తులు, బలహీనులు అధిక సమూహానికి భయపడితే అలాంటివారు ఎప్పుడు రమీ చేయాలి?**

జ: 1) జిల్‌హజ్ పదోతేదీ సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయం తర్వాత... కాని ఉషోదయానికి ముందు.

2) జిల్‌హజ్ పదకొండో తేదీ... సూర్యాస్తమయం తర్వాత శుభోదయం ముందు

3) జిల్‌హజ్ పన్నెండో తేదీ... సూర్యాస్తమయం తర్వాత శుభోదయం ముందు

**ప్ర: ఉల్లేఖనాల ప్రకారం అయ్యామె తష్రీక్‌లో అవతరించిన సూరా ఏది?**

జ: సూరె నసర్

**ప్ర: ఇస్లాం చరిత్రలో జమ్రతుస్సలాసకు రాళ్ళు కొట్టే ప్రక్రియ ఏ సంఘటనతో సంబంధం కలిగిఉంది?**

జ: జమ్రతుస్సలాసను రాళ్ళు కొట్టడం ఇబ్రాహీం(అలై) ఆచరణ స్మృతి చిహ్నం. ఆయన అల్లాహ్ ఆదేశం మేరకు హజ్రత్ ఇస్మాయీల్(అలై)ను జిబహ్ చేసే ఉద్దేశంతో మినాకు తీసుకెళుతుండగా మార్గమధ్యలో షైతాన్ ఇబ్రాహీం(అలైహి)ను మూడుచోట్ల తప్పుదోవ పట్టించాలని ప్రయత్నించాడు. ఇబ్రాహీం(అ) షైతాన్‌ను రాళ్ళతో కొట్టి తరిమారు.

**ప్ర: ప్రవక్త(స) మినా నుండి బయలుదేరి ఎక్కడ బస చేశారు?**

జ: ముహ్‌సిబ్ మైదానంలో.

**ప్ర: ప్రవక్త(స) మినా నుండి ఎప్పుడు బయలుదేరారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం జొహర్ నమాజ్ తర్వాత, మరో ఉల్లేఖనం ప్రకారం జొహర్ నమాజ్‌కంటే ముందు.

**ప్ర: ప్రవక్త(స) మినా నుండి ముహ్‌సిబ్‌కు చేరి ఏఏ నమాజులు చేశారు?**

జ: కొన్ని ఉల్లేఖనాల ప్రకారం అసర్, మగ్రిబ్, ఇషా నమాజ్‌లు చేశారు.

**ప్ర: మాతృమూర్తి ఆయిషా(రజి.అన్‌హా) రుతుక్రమం వల్ల విడిచిపెట్టిన ఉమ్రా గురించి ప్రవక్త(స)కు ఎక్కడ తెలియజేశారు?**

జ: ముహ్‌సిబ్ మైదానంలో ఉండే సమయంలో.

**ప్ర: మాతృమూర్తి ఆయిషా (రజి.అన్‌హా) విడిచిపెట్టిన ఉమ్రాను పూర్తి చేయడం కోసం ఎక్కడకు వెళ్ళి ఇహ్రామ్ ధరించారు?**

జ: తన్‌యీమ్ ప్రాంతం.

**ప్ర: ప్రవక్త(స) తన్యీమ్ ప్రాంతం వరకు ఆయిషా(రజి)తోబాటు తోడుగా ఎవరిని పంపారు?**

జ: ఆయిషా(రజి.అన్హా) అన్నయ్య అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబక్ర్ను

**ప్ర: మక్కావాసులు ఉమ్రా కోసం ఇహ్రాం ధరించాలనుకుంటే ఎక్కడ ధరించవచ్చు?**

జ: తన్యీమ్ ప్రాంతంలో.

**ప్ర: ఆయిషా(రజి.అన్హా) తన్యీమ్ ప్రాంతం నుండి తిరిగి వచ్చేంతవరకు ప్రవక్త(స) ఎక్కడ నిరీక్షించారు?**

జ: ముహస్సిబ్ లోయ వద్ద.

**ప్ర: ఆయిషా (రజి.అన్హా) విడిచిపెట్టిన ఉమ్రాను ఎప్పుడు పూర్తిచేశారు?**

జ: అయ్యామె తష్రీక్ పూర్తయిన తర్వాత, మదీనా బయలుదేరేముందు.

**ప్ర: ప్రవక్త(స) ముహస్సిబ్ ప్రాంతంలో కొంత సమయం గడిపి అక్కడినుండి ఎక్కడికి వెళ్ళారు?**

జ: వీడుకోలు తవాఫ్ చేయడం కోసం మక్కా నగరానికి వెళ్ళారు.

**ప్ర: ప్రవక్త వేడుకోలు తవాఫ్ (తవాఫెవిదా) ఎప్పుడు చేశారు?**

జ: ఫర్జ్ నమాజ్ కంటే ముందు

**ప్ర: తవాఫె విదా అంటే ఏమిటి?**

జ: మక్కా నుండి హాజీలు తమ జన్మస్థానానికి తిరిగి వెళ్ళేటప్పుడు చేసే తవాఫ్ను (తవాఫె విదా) అంటారు.

**ప్ర: తవాఫె విదా సమయం ఎప్పటివరకు ఉంటుంది?**

జ: మక్కానుండి వెళ్ళే లోపు ఎప్పుడైనా

**ప్ర: తవాఫె విదా ఎవరికొరకు తప్పనిసరి?**

జ: ఆఫాఖీ

**ప్ర: తవాఫె విదాను ఇంకా ఏఏ పేర్లతో పిలుస్తారు?**

జ: తవాఫె సదర్, రుఖ్‌సతీ తవాఫ్, విదాయీ తవాఫ్

**ప్ర: మీఖాత్ పరిధిలో ఉండేవారి కోసం తవాఫె విదా ఆదేశాలేమిటి?**

జ: తవాఫె విదా చేయడం అభిలషణీయం.

**ప్ర: బహిష్టు, పురుటి రక్తస్రావం కలిగిన మహిళలకు సంబంధించి తవాఫె విదా ఆదేశాలేమిటి?**

జ: వెసులుబాటు ఉంది

**ప్ర: ప్రవక్త(స) తవాఫె విదా పూర్తి చేసుకుని ఫజ్ర్ నమాజ్ ఎక్కడ చేశారు?**

జ: ఒక ఉల్లేఖనం ప్రకారం హరమ్‌లో, మరో ఉల్లేఖనం ప్రకారం ముహ్‌సిబ్ ప్రాంతంలో.

**ప్ర: తవాఫె విదా పూర్తి చేసుకుని హజీలు ప్రవక్త(స)తోబాటు మక్కా నుండి మదీనా వెళ్ళడానికి ఎప్పుడు బయలుదేరారు?**

జ: జిల్‌హజ్ 14వ తేదీన

**ప్ర: హజ్జతుల్ విదాను 'హజ్జతుల్ విదా' అని ఎందుకు అంటారు?**

జ: హి.శ పదో సంవత్సరంలో ప్రవక్త(స) చేసిన హజ్ ఆయన(స) జీవితంలో చివరిది. ఈ ప్రయాణంలో వీడుకోలు పలికేటప్పుడు జరిగే సాధారణ సంఘటనల వంటివి సంభవించాయి. అందువల్ల ఇది 'హజ్జ తుల్ విదా' అంటే వేడుకోలు హజ్ అని పేరుగాంచింది.

**ప్ర: ప్రవక్త(స) తన మరణానికి ఎన్ని నెలల ముందు మొదటి, చివరి హజ్ చేశారు?**

జ: ఉల్లేఖనాల ప్రకారం మూడునెలల ముందు.

**ప్ర: హజ్ ఫర్జ్ అయిన తర్వాత ప్రవక్త(స) మొదటి, చివరి హజ్ హిజ్రీ శకం ఏ సంవత్సరంలో చేశారు?**

జ: కేవలం ఒకేసారి హి.శ. 10వ సంవత్సరంలో

# హజ్, ఉమ్రాలోని ఫర్జ్, వాజిబ్‌లు

ప్ర: **హజ్‌లో ఫర్జ్ (విధులు) ఎన్ని ఉన్నాయి? వాటిలో ఒక్కటి వదిలినా హజ్ పూర్తవుతుందా?**

జ: హజ్‌లో మూడు విషయాలు ఫర్జ్. వాటిలో ఒక్క ఫర్జ్ వదిలినా హజ్ నెరవేరదు. భవిష్యత్తులో దాని 'ఖజా' తప్పనిసరి.

1. ఇహ్రామ్ ధరించడం 2. అరఫాలో ఉండటం 3. తవాఫె జియారత్

ప్ర: **హజ్‌లో వాజిబ్‌లు ఎన్ని ఉన్నాయి. అందులో ఒకటి విడిచిపెట్టినా హజ్ పూర్తవుతుందా?**

జ: కింద పేర్కొనబడిన విషయాలు హజ్‌లో వాజిబ్‌లు. అందులో ఏదైనా వాజిబ్ వదిలిపెడితే హజ్ నెరవేరుతుంది. కాని వాజిబ్ వదిలినందుకు తప్పనిసరిగా ఒక జంతువును ఖుర్బానీ ఇవ్వాలి.

## వాజిబ్ విషయాలు

1. మీఖాత్ నుండి (లేదా దానికంటే ముందు) ఇహ్రామ్ ధరించడం
2. అరఫాలో ఉండటం (మధ్యాహ్నం నుండి మగ్రిబ్ వరకు)
3. ముజ్దలిఫాలో ఉండటం- జిల్‌హజ్ పదోతేదీ ఉషోదయం తర్వాత నుండి సూర్యాస్తమయం కొంతసేపటివరకు.
4. రమీజిమార్ (షైతాన్‌లను రాళ్ళతో కొట్టడం).
5. రమీజిమార్-అంటే మూడు షైతాన్‌లను రాళ్ళతో కొట్టడం.
6. తలవెంట్రుకలు గొరిగించడం లేదా కత్తిరించడం (పురుషులు తలవెంట్రుకలు గొరిగించుకోవడం ఉత్తమం)
7. తవాఫె జియారత్- ఖుర్బానీ దినాలలో (అయ్యామె నహర్‌లో)
8. సఫా మర్వాల మధ్య సయీ చేయడం

9. తవాఫె విదా - ఆఫాఖీ (మక్కా బయటినుండి హజ్ చేయడానికి వచ్చే వారు) మక్కా నుండి వెళ్ళే సమయంలో కాబా తవాఫ్ చేయాలి.

**ప్ర: షరీఅత్‌లో హజ్, ఉమ్రాలలోని వాజిబ్‌ల గురించిన ఆదేశాలేమిటి?**

జ: హజ్, ఉమ్రాలలోని వాజిబ్ విషయాలను విడిచిపెడితే వాటిని పూర్తి చేయడం తప్పనిసరి. ఒకవేళ దానిని మళ్ళీ పూర్తి చేయకపోతే చెల్లుబాటు తప్పనిసరి. విడిచిపెట్టిన వాజిబ్‌లను పునరావృతం చేస్తేనే చెల్లుబాటు పూర్తవుతుంది.

**ప్ర: ఉమ్రాలో ఫర్జ్‌లు ఎన్ని ఉన్నాయి?**

జ: రెండు ఉన్నాయి : 1. మీఖాత్ లేదా హల్ నుండి ఇహ్రామ్ ధరించడం 2. రమ్ల్, ఇజ్తిబాలతో తవాఫ్ చేయడం

**ప్ర: ఉమ్రాలో వాజిబ్‌లు ఎన్ని**

జ: రెండు : 1. సఫా మర్వాల మధ్య సయీ చేయడం 2. తల గొరిగించుకోవడం లేదా వెంట్రుకలు కత్తిరించుకోవడం.

**ప్ర: హజ్ నిబంధనలను తెలిసీ తెలియక విఘాతం కలిగించడం ఎలా జరుగుతుంది?**

జ : 1. ఇహ్రామ్ స్థితిలో నిషిద్ధమైన విషయాలను చేయడం వల్ల

2. హజ్‌లోని ఏదైనా వాజిబ్‌ను విడిచిపెట్టడం లేదా సరిగ్గా నెరవేర్చకపోవడం

3. హరమ్ పరిధిలో నిషేధించబడిన పనులు చేయడం

**ప్ర: ఇహ్రామ్ స్థితిలో జరిగే పొరపాట్లేవి? ఏ ఆదేశాలను వ్యతిరేకించడం వల్ల లేదా విడిచిపెట్టడం వల్ల దమ్ (పరిహారం) తప్పనిసరి అవుతుంది?**

జ : 1. సుగంధం వినియోగించడం

2. కుట్టిన దుస్తులు ధరించడం

3. గోళ్ళు కత్తిరించడం

4. వెంట్రుకలు పీకడం, కటింగ్ చేయించడం
5. పేలను చంపడం
6. తల, ముఖం కప్పుకోవడం
7. సాక్సులు తొడగడం
8. భూభాగంపై జంతువులను వేటాడటం
9. మురికిని శుభ్రపరచడం
10. పోట్లాడటం
11. తవాఫె జియారత్‌కంటే ముందు స్త్రీ/ పురుషుడు కోరికతో చుంబించడం వల్ల పరిహారం తప్పనిసరి. హజ్ నెరవేరుతుంది.
12. అరఫాలో ఉన్నప్పుడు, తల గొరిగించుకున్న తర్వాత తవాఫె జియారత్ కంటే ముందు సంభోగం జరపడం వల్ల పరిహారం తప్పనిసరి. హజ్‌కు ఎలాంటి భంగం కలగదు.
13. ఇహ్రామ్ ధరించకుండానే హరమ్‌లో ప్రవేశించడం.
14. వుజూ చేయకుండా తవాఫ్ చేయడం
15. అపరిశుద్ధత, బహిష్టు, పురుటి రక్తస్రావ స్థితిలో, వుజూ చేయకుండా ఉమ్రా తవాఫ్ చేయడం
16. తవాఫె విదా, తవాఫె ఖుదూమ్ విడిచిపెట్టడం
17. ఏ కారణం లేకుండా స్వారీ చేస్తూ సయీ చేయడం
18. అరఫాత్ మైదానం నుండి సూర్యాస్తమయం అవకముందే బయలుదేరడం
19. సయీలోని ప్రదక్షిణలు విడిచిపెట్టడం
20. ముజ్దలిఫాలో సమయం కేటాయించకపోవడం
21. ఏదైనా రోజు రమీ జిమార్ విడిచిపెట్టడం

22. జిల్‌హజ్ పదమూడో తేదీ ఉదయం మినాలో ఉండి రమీజిమార్ విడిచిపెట్టడం

పైన పేర్కొన్న అన్ని పరిస్థితులలో దమ్ (పరిహారం) తప్పనిసరిగా చెల్లించాలి

**ప్ర: హరమ్ పరిధిలో జరిగే పొరపాట్లేవి?**

జ: రెండు. 1. హరమ్‌లోని జంతువులను కదిలించడం, వేటాడటం

2. హరమ్‌లోని చెట్లను, గడ్డిని కోయడం

**ప్ర: జినాయత్ అంటే ఏమిటి?**

జ: జినాయత్ అంటే పొరపాటు, తప్పిదం అని అర్థాలున్నాయి. ఇహ్రామ్ స్థితిలో, హరమ్ పరిధిలో హజ్ లేదా ఉమ్రాలోని ఆదేశాలను తెలిసీ తెలియకుండా పాటించకపోవడాన్ని 'జినాయత్' అంటారు.

**ప్ర: తప్పిదం (జినాయత్) జరగడం వల్ల ఎన్ని రకాల పరిహారం చెల్లించాలి?**

జ: మూడు రకాల పరిహారం చెల్లించాలి 1. దమ్ 2. బుద్‌లా 3. సద్‌ఖా

**ప్ర: ఉమ్రా కోసం ధరించిన ఇహ్రామ్ స్థితిలో నిషిద్ధమైన పనులు జరిగితే పరిహారంగా ఏం చెల్లించాలి?**

జ: సద్‌ఖా ఇవ్వడం వాజిబ్ అవుతుంది.

**ప్ర: హజ్ ప్రక్రియలో జరిగిన తప్పిదం వల్ల పరిహారంగా జిబహ్ చేసే జంతువును ఏమంటారు?**

జ: దమె జినాయత్– దమె కఫ్ఫారహ్

**ప్ర: దమ్ అంటే ఏమిటి? దమ్‌లో ఎలాంటి జంతువును ఖుర్బానీ చేయడం తప్పనిసరి?**

జ: హజ్ ప్రక్రియలో జరిగిన తప్పిదాల వల్ల పరిహారంగా ఇచ్చే ఖుర్బానీని 'దమె కఫ్ఫారా' అంటారు. పరిహారంగా ఒక మేక, గొర్రె, పొట్టేలు లేదా ఒంటె, ఆవులోని మూడో భాగం చెల్లించాలి.

**ప్ర: హజ్ లేదా ఉమ్రా కోసం ధరించిన ఇహ్రామ్ నుండి హలాల్ అవ్వాలంటే హరమ్ బయట తల గొరిగించుకుంటే ఏం చేయాలి?**

జ: పరిహారం (దమ్) తప్పనిసరి అవుతుంది

**ప్ర: హజ్ కోసం ధరించిన ఇహ్రామ్ నుండి హలాల్ అవ్వాలంటే హరమ్ బయట, నహర్ రోజుల తర్వాత తల గొరిగించుకోవడం వల్ల ఏం జరుగుతుంది?**

జ: రెండు పరిహారాలు (దమ్)లు వాజిబ్ అవుతాయి.

1. ఒకటి, హరమ్ బయట తల గొరిగించుకోవడం వల్ల 2. రెండవది, నహర్ రోజుల తర్వాత తల గొరిగించుకోవడం వల్ల

**ప్ర: హాజీ సూర్యాస్తమయానికి ముందు అరఫాత్ నుండి వెళితే తప్పనిసరిగా దమ్ (పరిహారం) చెల్లించాలి. ఎలాంటి పరిస్థితిలో పరిహారం చెల్లించనవసరం ఉండదు?**

జ: సూర్యాస్తమయానికి ముందు హాజీ అరఫాత్‌కి తిరిగి వచ్చినప్పుడు.

**ప్ర: హాజీ నహర్ దినాలలో ఖుర్బానీ ఇవ్వకుండానే ఇహ్రామ్ విప్పితే ఏమవుతుంది?**

జ : రెండు దమ్ (పరిహారాలు) చెల్లించాలి.

1. ఒకటి, కృతజ్ఞతగా ఇచ్చే దమ్ (పరిహారం)
2. రెండవది, ఖుర్బానీ ఇవ్వకుండా ఇహ్రామ్ విప్పినందుకు

**ప్ర: జిల్‌హజ్ పన్నెండో తేదీ సూర్యాస్తమయం వరకు హాజీ ఖుర్బానీ ఇవ్వకపోతే ఏమవుతుంది?**

జ: రెండు దమ్ (పరిహారాలు) చెల్లించాలి

1. దమె షుక్ర్ 2. నహర్ దినాలలో ఖుర్బానీ ఇవ్వడంలో ఆలస్యం చేసినందుకు

**ప్ర: తమత్తు లేదా ఖారిన్ ఇహ్రామ్ ధరించిన సంతోషంతో జిబహ్ చేసే**

**జంతువును ఏమంటారు?**

జ: దమె షుక్ర్.

ప్ర: **జంతువును జిబహ్ చేసే సమయంలో పఠించే దుఆ ఏ సూరాలో ఉంది?**

జ: సూరె అన్‌ఆమ్‌లో 164, 163, 80 ఆయత్‌లలో. **'ఇన్నీవజ్జహ్‌తు వజ్‌హియ లిల్లజీఫతరస్సమావాతి వల్‌అర్జ హనీఫన్ వమా అన మినల్ ముష్రికీన్. ఇన్నసలాతీ వ నుసుకీ వ మహ్‌యామ వ మమాతీ లిల్లాహి రబ్బిల్ ఆలమీన్. లాషరీక లహూ వ బి జాలిక ఉమిర్‌తు వ అన మినల్ ముస్లిమీన్. అల్లాహుమ్మ లక వ మిన్‌క– బిస్మిల్లాహి అల్లాహుఅక్బర్.** ఈ దుఆ పఠించి జిబహ్ చేయాలి. ఖుర్బానీ మనవైపు నుండి ఇస్తుంటే జిబహ్ తర్వాత ఈ దుఆ పఠించాలి.

ప్ర: **జంతువును జిబహ్ చేసిన తర్వాత చదవాల్సిన దుఆ తెలుపండి?**

జ: **అల్లాహుమ్మ తఖబ్బల్ మిన్నీ, కమాతఖబ్బల్‌త, మిన్ ఖలీలిక, ఇబ్రాహీమ అలైహిస్సలాము వ హబీబిక ముహమ్మదిన్ సల్లల్లాహు తఆలా అలైహి వ సల్లమ**– ఒకవేళ వేరే వారి తరఫునుండి అయితే **అల్లాహుమ్మతఖబ్బల్ మిన్ (ఫలానా, ఫలానా) కమా తఖబ్బల్‌త** నుంచి చివరి వరకు

ప్ర: **ఖుర్‌ఆన్‌లోని ఏ సూరాలో ఖుర్బానీని, ఇస్లామ్, ఈమాన్, ఇహ్‌సాన్ (పరోపకారం) అని నిర్ణయించడం జరిగింది?**

జ: సూరె హజ్ ఆయత్ నంబర్ 34,36,37

ప్ర: **బుద్‌నా అంటే ఏమిటి? ఇది ఏ పరిస్థితుల్లో తప్పనిసరి అవుతుంది?**

జ: హజ్ కార్యాల్లో పొరపాటు జరగడం వల్ల పరిహారంగా హరమ్ పరిధిలో తష్రీక్ రోజుల్లో సద్‌ఖాగా జిబహ్ చేయబడే జంతువు ఆవు లేదా ఒంటెను బుద్‌నా అంటారు. ఇది కింద పేర్కొనబడిన రెండు పరిస్థితుల్లో తప్పనిసరి అవుతుంది. మొదటిది – తవాఫె జియారత్ అపరిశుద్ధత, బహిష్టు, పురుటి రక్తస్రావ స్థితిలో చేసినప్పుడు.

రెండవది- అరఫా తర్వాత తవాఫె జియారత్, తల గొరిగించుకునే ముందు సంభోగం జరిపితే పెద్ద జంతువు ఒంటె లేదా, ఆవును ఖుర్బానీ ఇవ్వడం తప్పనిసరి.

**ప్ర: సద్‌ఖా ఎప్పుడు తప్పనిసరి అవుతుంది?**

జ: 1. తవాఫె ఖుదూమ్, తవాఫె సదర్, నఫిల్ తవాఫ్‌లు వుజూ లేకుండా చేయడం వల్ల.

2. తవాఫె ఖుదూమ్, తవాఫె సదర్, నఫిల్ తవాఫ్‌లోని కొన్ని ప్రదక్షిణలను విడిచిపెట్టడం

**ప్ర: తవాఫె ఖుదూమ్, తవాఫె విదాలోని కొన్ని ప్రదిక్షణలు విడిచిపెడితే పరిహారంగా ఏం చెల్లించాలి?**

జ: విడిచిపెట్టిన ప్రతి ప్రదక్షిణకు పూర్తి సద్‌ఖా చెల్లించడం వాజిబ్ అవుతుంది. ప్రదక్షిణలన్నీ మళ్ళీ పునరావృతం చేస్తే సద్‌ఖా చెల్లించడం అవసరం లేదు.

**ప్ర: తవాఫె ఖుదూమ్, తవాఫె విదా, నఫిల్ తవాఫ్‌లో వుజూ చేయకుండా ప్రదక్షిణలు సగం కంటే తక్కువ చేస్తే పరిహారంగా ఏం చెల్లించాలి?**

జ: ప్రతి ప్రదక్షిణకు బదులుగా సగం 'సా'సద్‌ఖాగా ఇవ్వాలి. వుజూచేసి తవాఫ్ చేస్తే కఫ్ఫారా చెల్లించాల్సిన అవసరం లేదు.

**ప్ర: షరీఅత్‌పరమైన కారణం లేకుండా సయీలోని కొన్ని ప్రదక్షిణలు వాహనం లేదా స్వారీ ద్వారా చేస్తే పరిహారంగా ఏం చెల్లించాలి?**

జ: ప్రతి ప్రదక్షిణకు బదులు సద్‌ఖా చెల్లించాలి

**ప్ర: అయ్యామె తష్రీక్‌లో రమీ జమ్రాత్ చేస్తూ కొన్ని రాళ్ళు తక్కువగా కొట్టడం వల్ల పరిహారంగా ఏం చెల్లించాలి?**

జ: ప్రతి రాయికి బదులు సద్‌ఖా చెల్లించాలి.

ప్ర: షరీఅత్‌లో ఒక 'సా' పరిమాణం ఎంత అవుతుంది?

జ: పావు తక్కువ రెండు సేర్లు

**ప్ర: ఇహ్రామ్ స్థితిలో స్త్రీలను ఏ విషయాల గురించి వారించడం జరిగింది?**

జ: ముఖంపై వస్త్రం కప్పుకోవడం, కాషాయం కలిగిన దుస్తులు ధరించడం.

**ప్ర: స్త్రీలు ఇహ్రామ్ స్థితిలో, ఆభరణాలు, సాక్సులు, గాజులు ధరించడం గురించి ఆదేశాలేమిటి?**

జ: ధరించవచ్చు. కాని ధరించకుండా ఉండడం ఉత్తమం.

**ప్ర: స్త్రీలు బహిష్టు, పురిటి రక్తస్రావంలో ఉండి జిల్‌హజ్ పన్నెండో తేదీ సూర్యాస్తమయం వరకు తవాఫె జియారత్ చేయకపోతే పరిహారం ఏమిటి?**

జ: ఎలాంటి పరిహారం ఉండదు. పరిశుద్ధం అయిన వెంటనే తవాఫ్ చేయాలి

**ప్ర: సయీ పూర్తి చేసుకుని రెండు రకాత్‌ల నమాజ్‌కు సంబంధించి ఏమని ఆదేశించబడింది?**

జ: ఉత్తమం

**ప్ర: హజ్ ఇహ్రామ్ ధరించిన తర్వాత రగ్గు, దుప్పటి వంటివి కప్పుకునే వాటి గురించి ఏమని ఆదేశించబడింది?**

జ: దుప్పటి, రగ్గులాంటివి కప్పుకోవచ్చు. కాని తల, ముఖంపై కప్పుకో కూడదు. లేదంటే పరిహారం చెల్లించాల్సి ఉంటుంది.

**ప్ర: రమ్ల్, ఇజ్తిబా ఏ తవాఫ్‌లో ఉన్నాయి?**

జ: తవాఫ్ తర్వాత సయీ చేయబడే దాంట్లో రమ్ల్, ఇజ్తిబాలు ఉన్నాయి.

**ప్ర: రమీ జమరాత్ కోసం బదులు (నియాబత్) చెల్లుతుంది. హజ్‌లోని ఇతర కార్యాల్లో ఇదిచెల్లదు? ఎందువల్ల?**

జ: హజ్‌కార్యాల్లో తవాఫ్, సయీవంటి వాటిలో సమయం చాలా ఉంటుంది. కాని రమీ కోసం సమయం ఎక్కువగా ఉండదు. అదేవిధంగా అరఫాలో సమయం వెచ్చించడం, మినా, ముజ్దలిఫాలలో రాత్రి గడపటంలోనూ

సమయం చాలా తక్కువగా ఉంటుంది. అయినప్పటికీ ఏవిధంగానైనా కొంచెం కష్టపడితే ఆ ప్రాంతాలకు చేరుకోవచ్చు. కాని రమీ కోసం ఇలా చేయలేము. కాబట్టి బలహీనులకు, వికలాంగులకు రమీ జమరాత్‌లో బదులు ఉండవచ్చని ధర్మపండితుల నిర్దేశాలున్నాయి.

**ప్ర: రమీ జమరాత్ కోసం బదులు గురించి ధృవపరిచే ఇబ్నెమాజాలో ఉన్న జాబిర్ గారి ఉల్లేఖనం ఏమిటి?**

జ: జాబిర్(రజి) ప్రకారం మేము ప్రవక్త(స)తో పాటు హజ్ చేశాము. మాతోపాటు స్త్రీలు, పిల్లలు కూడా ఉన్నారు. మేము పిల్లలకు బదులు రమీచేశాము, తక్బీరు కూడా పలికాము.

**ప్ర: ముఫ్రద్, ముతమత్తు లేదా ఖారిన్ సయీ ఎప్పుడు చేయడం ఉత్తమం?**

జ: 1) హాజీ ముఫ్రద్ అయితే సయీ తవాఫె ఖుదూమ్ తర్వాత కాకుండా తవాఫె జియారత్ తర్వాత చేయాలి.

2) హాజీ ఖారిన్ అయితే సయీ తవాఫె ఖుదూమ్‌తో చేయడం ఉత్తమం. ఖారిన్ తవాఫె జియారత్ తర్వాత కూడా సయీ చేయొచ్చు.

3) హాజి ముతమత్తు అయితే తవాఫె జియారత్ తర్వాత సయీ చేయాలి.

**ప్ర: ఇహ్రామ్ స్థితిలో అవాంఛనీయమైన విషయాలు ఏమిటి?**

జ: శరీరంపై మాలిన్యాన్ని శుభ్రపరచడం

శరీరం, తల, గడ్డాన్ని సబ్బుతో కడగటం

దిండుపై ముఖంపెట్టి నిద్రపోవడం

సువాసన కల పదార్థాలు తినడం

**ప్ర: ఇహ్రామ్ స్థితిలో అభిలషణీయమైన విషయాలేమిటి?**

జ: 1) మాలిన్యాన్ని శుభ్రపరచుకోవడానికి, చల్లదనం పొందడానికి చల్లనీరు లేదా వేడినీటితో స్నానం చేయడం

2) దిండుపై తలపెట్టి నిద్రపోవడం

3) అద్దంచూడటం

4) మిస్వాక్ చేయడం

5) సువాసన లేని సుర్మా పెట్టుకోవడం

6) హానికర జంతువులను చంపడం

7) తలకు నూనె పూయడం

# మస్జిదె నబవీ సందర్శన

ప్ర: ప్రవక్త(స) ఇలా ప్రబోధించారు : 'ప్రపంచంలో మూడు మస్జిదులను దర్శించడం కోసమే ప్రయాణం చేయాలి' అవి ఏవి?

జ: 1) మస్జిదె హరామ్ 2) మస్జిదె అఖ్సా 3) మస్జిదె నబవీ

ప్ర: 'మస్జిదె నబవీని సందర్శించడం సున్నత్' హజ్ చేసి మస్జిదె నబవీని సందర్శించని వారి గురించి ప్రవక్త(స) ఏమని హితవు పలికారు?

జ: 'నిశ్చయంగా వారు నాపై దౌర్జన్యం చేశారు'

ప్ర: 'నా మస్జిద్‌లో ఒక్కపూట నమాజ్ చేస్తే ఇతర మస్జిద్‌లలో పదివేల సార్లు నమాజ్ చేయడం కంటే ఉత్తమం (మస్జిదె హరామ్ తప్ప)' ప్రవక్త(స)గారి ఈ ఉపదేశాన్ని ఉల్లేఖించిన సహాబీ ఎవరు?

జ: అబూహురైరా (రజి)

ప్ర: "నా మస్జిద్‌లో ఒక్కపూట నమాజ్ చేయడం ఇతర మస్జిద్‌లలో పదివేల నమాజ్‌లు చేయడం కంటే ఉత్తమం. అదేవిధంగా మస్జిదె హరామ్‌లో ఒకపూట నమాజ్ చేయడం నా మస్జిద్‌లో వంద నమాజ్‌లు చేయడం కంటే ఉత్తమం" ప్రవక్త(స)గారి ఈ ప్రవచనాన్ని ఉల్లేఖించిన సహాబీ ఎవరు?

జ: అబ్దుల్లా బిన్ జుబైర్

**ప్ర: "నా ఇంటికి మెంబర్ (మస్జిద్‌లో ఖుత్బా ఇచ్చే వేదిక)కి మధ్య స్వర్గవనాలలో ఒక వనం ఉంది. నా మెంబర్ కౌసర్ కొలను" ప్రవక్త(స) ఏ ప్రాంత ప్రాధాన్యతను తెలుపడం కోసం ఇలా పేర్కొన్నారు?**

జ: రయాజుల్ జన్నత్

**ప్ర: ప్రవక్త(స) మస్జిదె నబవీలో నలభై నమాజ్‌లు జమాఅత్‌తో చదివినవారి గురించి ఏమని శుభవార్త ఇచ్చారు?**

జ: ఇలాంటి వారి గురించి ప్రవక్త(స) ఇలా ప్రబోధించారు : 'నరకంలోని ప్రతి శిక్ష నుండి విముక్తి పొందినట్లు రాసివ్వబడుతుంది'.

**ప్ర: ప్రవక్త(స) ఇలా ప్రబోధించారు 'ఎవరయితే నా సమాధిని సందర్శిస్తారో వారికోసం నా సిఫారసు తప్పనిసరి అవుతుంది' ఈ హదీసు ఉల్లేఖించిన సహాబీ ఎవరు?**

జ: అబ్దుల్లాహ్ బిన్ ఉమర్(రజి)

**ప్ర: మస్జిదె నబవీలో ఖిబ్లా ఎటువైపు ఉంది?**

జ: మక్కాకు దక్షిణాన ఉంది.